# రసమయి

(కథల సంపుటి)

రచయిత

శ్రీ ప్రభాత్ కుమార ముఖోపాధ్యాయ

అనువాదకుడు:-

శ్రీ దిగవల్లి శేషగిరిరావు

వెరైటీ ఏజన్సీస్‌వారి
అరుణ ప్రచురణ - బెజవాడ

# పరిచయం

బారిష్టర్ ప్రభాత్‌కుమార్ ముఖోపాధ్యాయులు వంగభాషలో కథారచన యందు సిద్ధహస్తుడు. అతిస్వల్పకాలంలోనే ఉత్తరహిందూస్థానమున ఈయన రచనలకు మిక్కుటమగు ఆదరము కలిగినది.

ఈయన కథలను, నవలలను, విమర్శించు సందర్భమున పలువురు, "విశ్వకవి, రవీంద్రుడు, సుప్రసిద్ధ నవలారచయితలు సర్ వాల్టర్ స్కాట్, టాల్‌స్టాయ్ మొదలుగాగల వారి రచనలను చదువగా గలుగు ఆనందమే వీరి కథలు చదువుటవలన లభించునని తెలిపియుండిరి."

ముఖ్యముగ ప్రభాత్‌బాబు కథలన్న రవీంద్రున కెంతయో అభిమానము. "కథారచనయందు ప్రభాత్ కుమారుని ప్రతిభ, రణరంగమున- వ్యూహరచనమున సవ్యసాచి అర్జునునకు కలంత" కలదనియు, కథను ఆసాంతము ఒకేఒక్క లక్ష్యముతో పూర్తిచేయుననియు ఈ కథకుని ప్రశంసించెను.

నేను ఒకటి రెండు నవలలు, కథలూ చదువుటవల్లనూ, పలువురు నన్నాదరించు అభిమానులు, మిత్రులు, ప్రోత్సహించుటవల్లనూ మిత్రులు శ్రీ శేషగిరిరావుగారిని శ్రమపెట్టి ఈపుస్తకమును ఈనాటికి "రసమయి" అనుపేర ఆంధ్రలోకమునకు ఒసంగ గలిగితిని. శ్రమకోర్చి, ఉత్సాహముతో ఈ కథలను అనువదించి నాకొసంగిన శ్రీ శేషగిరిరావుగారికి నే నెంతయు కృతజ్ఞుడను.

కాగితపు కాటకపు రోజులైననూ, దొరకనంతలో, వీలైనమట్టుకు, యిటులనే పలువురు రచయితల రచనలను మా అరుణప్రచురణల రూపమున వెలువరింప దలచిన నా సంకల్పమును పాఠకులు మన్నించుదురని ఆశించుచున్నాను.

కంభంమెట్టు సత్యనారాయణరావు,
సంపాదకుడు
అరుణప్రచురణలు – బెజవాడ,

౪

నూతన సంవత్సరమునకు

# మా నూతన ప్రచురణలు

1. ప్రేమచందు కథలు
(రసవంతమగు 6 కథల సంపుటి)

2. మణి దీపాలు
(పలువురి కథకుల కథలు)

3. విప్రదాసు
(శ్రీ శరత్ బాబు క్రొత్త నవల)

4. పంజాబు కేసరి
(శ్రీ లాలా లజపతిరాయి చరిత్ర)

# తాపీజు

లాల్‌గంజ్ గ్రామంలో పూర్వం ఒక వెయ్యిమందికి పైగా (హిందూ) సాలీలు వుండేవారు. ఆవూరుమధ్య ఒక విశాలమైన బహిరంగప్రదేశం వుంది. ఆ ప్రదేశంలో వారానికి రెండుపర్యాయములు సంత పెడుతూవుండేవారు. ఆ సంతలో ఖద్దరు ధోవతులు, అంగవస్త్రములు, ముతక దుప్పట్లు మొదలైనవి ఎక్కువగా అమ్మడవుతూ వుండేవి. చాలాదూరపు వూళ్ళనుంచి కూడా జనం వచ్చి కొనుక్కుపోతూ వుండేవారు. ఇచ్చటి నేతగుడ్డ సన్ననెంబరుది కాకపోయినప్పటికీ, ఎక్కువ కాలం మన్నుతుంది. ఆ రోజుల్లో సాలీలు అంతా ధనవంతులు. ప్రతియేటా శివరాత్రికి బ్రహ్మాండంగా వుత్సవం చేస్తూవుండేవారు. అందరివీ గట్టియిళ్ళే. చాలమందికి పొలము - పుట్ర కూడా వుండేది. చాలామంది బాగా చదువుకున్నవాళ్ళే.

కాని, కాలమహిమ! నేడు పై విషయములను తలచికొన్నచో స్వప్నమువలె తోస్తుంది. విదేశీవస్త్రముల వ్యాపారము వృద్ధికావటంతో మన సాలీలపరిస్థితులు తారుమారైనవి. రాను రాను వున్న ఆస్తి - పాస్తులను అన్నిటినీ తెగనమ్ముకొన్నారు. చివరకు తిండికి మొగము వాచారు. ఇప్పుడు

కూడా సాలీలు వున్నారు. కాని బహుకొద్దిమంది. ఏదోవిధంగా ఒకపూట తిని తినక జీవిస్తున్నారు.

ఇవ్వాళ లాల్‌గంజ్ బజారులో ధోవతుల జత అమ్ము కునేందుకు బయలుదేరాడు కల్లూ. అది జ్యేష్ఠమాసము. సూర్య భగవానుడు తన తీక్ష్ణకిరణములచే పగలంతయు అగ్నివర్షమును కురిపించి అస్తాచలమునకు పోనున్నాడు. కల్లూ ఒక మర్రిచెట్టు నీడక్రింద, గడ్డిపై కూర్చుని యున్నాడు. ఎదుట ఒక అంగవస్త్రము పరచివున్నది. దానిమీద నల్లంచు ధోవతులజత పెట్టివుంది. ఇంత తక్కువ సరుకుతో కల్లూ ఎన్నడూ బజారుకు రాలేదు. ఇంటమిగిలియున్న డబ్బంతయూ జమీం దారుకు శిస్తు చెల్లించుటచే, నేడు అతనిచేత రాగిదమ్మిడీయైనను లేదయ్యెను.

కల్లూ వయస్సు నలభైకి పైగా వుంటుంది. కండపుష్టి కలవాడుకాడు. కనులు గుంటలుపడి వున్నవి. బుగ్గలు అంటుకు పోయాయి. అతడు యీస్థితిలో వుండుటకు ఆ గ్రీష్మఋతువు నందలి ఎండ కారణంకాదు. ఇప్పటివరకు అతడు భోంచేసి యుండకపోవటంకూడా ఒకకారణమే. ఉదయమున ఉడక బెట్టిన రెండు బంగాళాదుంపలును తిన్నాడు. ఈ బట్టల జతను అమ్మి డబ్బు తీసికొనిపోతేనే, నేడతనియింట భోజనము దొరకుట. లేనిచో పస్తుండవలసిందే. ఇంటిలో అతడేకాక, అతనిభార్యా యిద్దరుబిడ్డలూకూడ వున్నారు. అందువలననే నేడు కల్లూకు అంత కష్టముగా నున్నది.

పదిక్రోసుల చుట్టుపట్ల లాల్‌గంజిసంతయే పెద్దది. చాలా గ్రామములనుంచి ఎంతోమంది దుకాణములు పెట్టుటకు వ్యాపారస్తులు వచ్చారు. అంతులేని జనసమూహము.—ఏదుకాణమువద్దచూచినను కొనువారే. పాపము! కల్లు ఒక్కడే బేరములేకుండ కూర్చున్నాడు. బేరగాళ్ళను ఎంత పిలచినను ఎవరూ వినిపించుకోరైరి. చివరకు ఒక వృద్ధుడువచ్చి నిలబడెను. బట్టలను పరీక్షచేసి,ధరఅడిగెను. రెండున్నరరూపాయలు బాబూ! అని చెప్పగానే అతడు మొగము చిట్లించుకొని,ధోవతులను అచ్చటనే పడవైచి వెళ్ళిపోయెను. కల్లు 'ఎంత యిస్తారు?' అని ఎన్నిపర్యాయములు అడిగినప్పటికీ, అతడు తిరిగి చూడనైనాలేదు.

కల్లూవిచారముతో కూర్చున్నాడు. 'ఇంటివద్ద పిల్లలెల్లాఉన్నారో' అని తహతహపడసాగాడు. అతడి మూడేళ్ళ కుర్రవాడు సుఖ్యా, ఐదేళ్ళ కూతురు నన్హాకీ - యిద్దరూ పుదయాన ఒకకాసీ వేపుడుశనగలు కొనుక్కొని తిన్నారు. ఇప్పటివరకు వాళ్ళిద్దరూ ఆకలిబాధ భరించలేక తల్లిని నానాబాధలు పెట్టుతూవుంటారు. నా భార్య నేనిచ్చిన బంగాళా దుంపలను తినివుండదు ఇవన్నీ తలపుకురాగానే అతని కండ్లలో నీరు గిరుర్రున తిరిగింది.

ఇతని పూర్వస్థితి యింత హీనమైనదికాదు. కల్లూ తండ్రి లల్లు చాల గౌరవముతో బ్రతికిన సాలివాడు. మంచి యిల్లు, తోటా-దొడ్డీ, పొలముకూడా సంపాయించారు. ఇంట్లో ఎప్పుడూ పదిమగ్గాలు ఆడుతూ వుండేవి. చాలమంది

నౌకరులు పనిచేస్తూ వుండేవారు. లల్లూ కాలంలోనే మాంచె స్టరు బట్టలువచ్చి చాలమందినోట దుమ్ముకొట్టినవి. కాని, అతని కాలంలో అన్న-వస్త్రాలకు ఏ లోటుండేదికాదు. కాని, కల్లూ పెద్దవాడుకాక ముందే లల్లూ చనిపోయెను. నేటికిపాతిక సంవత్సరాలక్రితపు సంగతియిది. నేను ఆ గోడలతో కట్టిన పెంకుటియిల్లులేను. మరమ్మతుచేసే తాహతు కల్లూకు లేకపోవ టంచే యిల్లంతా కూలిపోయింది. దానిస్థానే ఒక పూరిల్లుకట్టు కుని కాలక్షేపం చేస్తున్నాడు. పొలము అంతా పోయింది. యిప్పుడు మూడు నాలుగు సెంట్లు మాత్రం మిగిలింది. మిగతా పొలమంతా వేలంలో గోవర్ధనశుక్ల కొన్నాడు. ఒక రోజున, ఒక్కసారిగా కాదు. అప్పుడప్పుడు కల్లూకు కష్టసమ యంలో ఆదుకునేది శుక్లజీ ఒక్కడే. అడగగానే అప్పిస్తూ వుంటాడు. కాని, వడ్డీకొంచెం హెచ్చు. ఎప్పుడైన కల్లూ వడ్డీ తగ్గించండని అడిగితే కల్లూ నాకుకూడా పిల్లా జెల్లా వున్నారు. నాకు మాత్రం ఎలాగడుస్తుందిచెప్పు ? అంటాడు. కల్లూకు బాకీ వందలకు వందలు ఎలాపెరిగి పోతోందో ఏమీతెలియదు. ఎప్పుడైనా అడిగితే 'కల్లూ, మాలాటి యింతింత చదువుకున్న వాళ్ళకే యీ కోర్టులు, రూల్సు అర్థంకావోయ్; అలాంటప్పుడు నీలాటి వాళ్ళకు ఏం అర్థం అవుతాయ్' అని చెపుతూ వుం టాడు శుక్లజీ.

సాయంత్రం అయింది. దూరదూర గ్రామాలు పోవల సిన దుకాణాదారులు అంతా దుకాణములను కట్టివేసి బయలు దేరుటకు సిద్ధంగా వున్నారు. కొందరు వెళ్ళిపోయారు కూడా.

ఎల్లప్పుడూ వుండే దుకాణాలు కొన్ని మాత్రం. తెరచివున్నాయి వాటిలో శుక్లజీగారి బట్టలషాపు ఒకటి. వీరిషాపు వద్దకూడా ఎక్కువమంది జనంలేరు. ఇద్దరు ముగ్గురు పల్లెరైతులుకూర్చుని విదేశీధోవతులలో ఏమార్కు ధోవతులను తీసుకుందామా అని ఆలోచిస్తున్నారు.

తన పంచలజత అమ్ముడుపోదని నిరాశచేసుకుని కల్లూ లేచి నుంచున్నాడు. వీటిని శుక్లజీ దుకాణంలో అమ్మి, వారిని బ్రతిమాలుకుని డబ్బు తీసుకుపోదామనుకున్నాడు. శుక్లజీ అంటే కల్లూకు యిష్టంలేదు. బజారులో అందరికంటే చౌకగా అడుగుతాడు. అదీగాక రొఖుబేరంకాదు. అమ్ముడు పోయాకగానీ డబ్బివ్వడు. ఇలా ఎన్ని మారులో కల్లూ శుక్లజీ గారి షాపులో బట్టలను యిచ్చాడు. నోటితో లెక్క చూసు కుని, నాకు యింతడబ్బు వస్తుందిగదా అని మురిసిపోతూ శుక్లజీ దగ్గిరికి వెళ్ళి డబ్బు అడగటం, అతడు లెక్కచూసి "కల్లూ లెక్కవేసుకున్న దానికంటె చాలా తక్కువ వస్తుందని చెప్పటా, కల్లూ అనుమానిస్తూ నుంచుంటే" కల్లూ! ఖాతాలో రాసివున్నది- వున్నట్లు చెపుతున్నాను. నీ దేమో నోటిలెఖ్ఖాయె! ఇదేమో, కాగితంమీద రాసిన లెఖ్ఖాయె ఇలా రాసిందాంట్లో ఎలా తేడావస్తుంది? పొరపాటుగా లెక్కవేసికున్నావేమో? అనగానే,మారు మాటాడలేక కల్లూ వెళ్ళిపోవటం జరుగుతూ వుండేవి. అందు కని ఎంతో అవసరం అయితేనేగాని, కల్లూ శుక్లజీ షాపుకు పోయేవాడు కాదు.

కల్లూ ధోవతులచాపును తీసుకొని శుక్లజీ దుకాణం వద్దకు వెళ్ళినప్పుడు, శుక్లజీసాపు ఖాతా చూస్తూ వున్నాడు. అయన్ని చూసి కల్లూ చేతులు జోడించి, 'బాబయ్యా పంచల చాపు తెచ్చాను. తీసుకుంటారా?' అని అడిగాడు.

'సరే, తే. ఎంతధర?' అని శుక్లజీ ధోవతులను తీసుకుని పరీక్షించసాగాడు.

'జత నాలుగురూపాయిలు బాబూ, శుక్లజీ పకపక నవ్వుతూ - నాలుగు రూపాయలే! కొనేవాడుకూడా నాలుగు రూపాయలు యివ్వడు.

'ఎందుకివ్వడు బాబయ్యా? ఎనభై య్యోనంబరు నూలు మీ దగ్గిర జత అయిదురూపాయలకు అమ్ముడు పోతాయి!

పిచ్చివాడా! అయిదురూపాయలు ఎవరిస్తారు? ఆరోజులు పోయాయి. జత రెండురూపాయలకు వచ్చే విదేశీ గుడ్డ తెచ్చి, రెండిటినీ సరిచూడు- తెలుస్తుంది. అలాటప్పుడు రెండు రూపాయలన్నర ఎక్కువపెట్టి ఎవరుకొంటారోయ్? మరీ పెడితే నాలుగున్నర పెడతారేమో. అదైనా ఎప్పటికో? హోలీపండుగకు కూడా అమ్ముడుపోతాయో, పోవో?

'కాదు బాబయ్యా, తప్పకుండాఅమ్ముడు పోతాయి. ఖాతాలో రాసుకోకుండా యిప్పించండి బాబయ్యా.'

'రొఖ్ఖమా! ఎక్కడ్ణించి! అమ్ముడయ్యాక యివ్వాల్సిందే,

'బాబయ్యా, మీరు బ్రాహ్మలు, దేవుడితో సమానమైనవారు. మీతో అబద్ధంచెబుతానా బాబయ్యా. చాలా అవసరంవుండి వచ్చాను. యిప్పించండి బాబయ్యా.'

" ఎమిటో అవసరం?"

"ఇంట్లో రాగిడమ్మిడీకూడా లేదు. ఈడబ్బుపెట్టి,ఏమన్నా తీసుకు వెడితేనే యివ్వాళతిండి తినేది. లేకపోతే యింటిల్లపాదీ పస్తుపడుకో వలసిందే బాబయ్యా!

"నువ్వు చెప్పిందినిజమే. కాని, నాసంగతి కూమ చూడాలిగా. నీకు నాలుగురూపాయలు రొఖ్ఖం యిచ్చాననుకో. హోలీ వరకూ యివ్వ అమ్మడు కాకపోతే, దానికి వడ్డీ ఎంతవుతుందో తెలుసా?"

"ఈ తడవకి వడ్డీ తీసెయ్యండి బాబయ్యా!

తీసేస్తే ఎల్లాగోయ్? నేనుకూడ గృహస్తునే ఏమన్నా కానీ, అంతఅవసరమైతే రెండురూపాయలుయిస్తా,తీసుకువెళ్ళు!

శుక్లజీ క్యాషుబాక్సు తెరచి కల్లూకు రెండురూపాయాలు యిచ్చెను. అతడికి కొద్దిదూరంలో, పెద్దకొడుకు మున్నూ కూర్చుని, దుకాణముకు సంబంధించిన పనులు చూస్తూవున్నాడు. శుక్లజీ అతడివైపుచూసి, మున్నూ, కల్లూ పేర జత పంచలకు నాలుగురూపాయలు జమరాసి, రొఖ్ఖం రెండురూపాయలు ఖర్చు రాయి, అన్నాడు.

కల్లూ వెళ్ళిపోయెను.

మున్నూ, ఖాతాలో నాలుగురూపాయలకు బదులు మూడున్నర రూపాయలే జమ రాసెను. సాలీల లెఖ్ఖలు రాసేటప్పుడు నోటితో చెప్పినదానికి యీ విధంగా తగ్గించి జమ రాయటం, యీ దుకాణపు ఆచారం. మున్నూ తండ్రికి తగ్గ కొడుకే.

## 2

కల్లూ ఒకరూపాయి మార్చి కావలసిన సరుకులు తీసుకుని తొందరగా యింటికివచ్చాడు. చీకటిపడబోయే సమయం. కల్లూలోపల కాలు పెట్టగానే, భార్య ఎదురుగావచ్చి 'ఏమండి బట్టలు అమ్ముడుపోయాయా ?' అని అడిగింది.

"లేదు సంతలో ఎవరూ కొనలేదు శేక్లజీ దుకాణంలో యిచ్చాను."

"ఏమన్నా రొఖం యిచ్చాడా?"

"రెండు రూపాయలు యిచ్చాడు. ఒక రూపాయిమార్చి అర్ధరూపాయిపెట్టి సరుకులు తెచ్చాను."

"రెండు రూపాయలేనా?"

"అదికూడా యివ్వనన్నాడు. ఎంతో బ్రతిమాలితే యిచ్చాడు.

"ఆయన దుకాణానికే వెళ్ళారూ? దొంగ – అంతా మోసమే - ఆయన సంగతి యింకా తెలుసుకోలేదూ?

"ఛా,తప్పు.అలా అనరాదు. వారు బ్రాహ్మలు. నిందించకూడదు. బ్రాహ్మలంటే ఏమనుకున్నావో, కలియుగ దేవతలు.

"దేవతలట దేవతలు! దేవతలు యిలాగే వుంటారేం? దేవతలు బీదలరక్తాన్ని పీల్చుకు తాగుతారా?"

"వూరుకో – ఏజన్మలోచేసుకున్నామో, యింత కష్టపడుతున్నాము. ఇప్పుడు బ్రాహ్మల్నికూడా తిట్టి యింకా పాపం కొని తెచ్చుకుంటే,నరకంలోకూడా మనకుచోటుండదు."

ఆమె కొంచెం మెత్తబడి, అమ్మడు కాకపోతే యింటికే తీసుకురాకపోయారా? మన సొమ్మంతా ఆయనే మింగాడు. ఇప్పటికీ మీకు తెలియటల్లేదు!"

"తెస్తే నోట్లోకి వెళుతుందా?"

"పిల్లలు తిన్నారు. మీరు బజారుకు వెళ్ళాక, పిల్లలు ఒకటే గోల. వాళ్ళబాధ చూడలేక మెడలోవున్న తాయెత్తును అమ్మి అయిదురూపాయలు తెచ్చాను, వాటితో సరకులు తెచ్చి వంటచేసి, వాళ్ళకు పెట్టాను

ఈ మాట వినేటప్పటికీ కల్లూ గజగజ వణుకుతూ "ఆఁ? ఏమిటి! దాన్ని అమ్మేశావూ?"

"ఆ, ఏంచెయ్యను? ఆకలికి ఆగలేక ఏడుస్తాంటే చూసి, ఎలావూరుకోను! మీరు మట్టుకు వూరుకోగలరా? సాయంత్రికిగానీ రారని తెలుసాయెను ఇంకేదన్నా అమ్మి తెద్దామంటే యింకేముంది?"

అని కల్లూ భార్య కన్నీటినిఆపుకొనుటకు పమిటచెంగును అడ్డుపెట్టుకొంది.

"అది యిప్పటిదా? ఎన్ని తరాలనుంచీ వున్నదో. దాంట్లో ఎంత మహాత్మ్యం వుందో తెలుసా? ఇంట్లో పిల్లలకు ఏదైనా సుస్తీ చేస్తేనీళ్ళతో దాన్నికడిగి, ఆ నీళ్ళు తాగిస్తే వెంటనే తగ్గుతుంది. అలాంటిదాన్ని నీవు అమ్మేశావు! దాని మూలానే మనం యీ విధంగానన్నా బ్రతికివున్నాం. అది పోయింది, మనం నాశనం అయ్యేందుకే యిలావచ్చింది!

"నాకుమట్టుకు తెలియదా ఏం! ఒక సంగతి చెప్పటం మరిచిపోయాను. షరాపు దాన్ని మధ్యకు విరిచాడు. విరిచేప్ప టికే లోపల యాంత్రంవేసిన భోజపత్రం కిందపడ్డది. దాన్ని యిటూఅటూ తిప్పిచూసి' దీనిమీద ఏదో యంత్రం వేసి వుంది. తీసుకుపో అని యిచ్చాడు. దాన్ని తీసుకువచ్చాను. ఈ మహిమంతా దాని దేగాని, బంగారందికాదు. దీన్ని రాగి తాయెత్తులో పెట్టి బిగిస్తే సరిపోతుంది."

'అలాగా! నాకు తెలియదు. ఎవరన్నా చదువుకున్న వారిని అడిగివస్తాను. ఏదో అయిపోయింది. ఇప్పుడు ఏంచేసేదీ లేదు. పిల్లలేరి ?'

'నిద్రపోయారు. మీకోసం రొట్టెలు దాచిపెట్టాను. కాళ్ళు కడుక్కొని రండి!'

'నువ్వు తిన్నావా ?'

'మీరు తినందేనా? మీరు తినండి. తరవాతతింటాను!'

కల్లూ కాళ్ళు – చేతులు కడుక్కొని రొట్టెలు తినేందుకు కూర్చున్నాడు. భోంచేసిన తరువాత, మంచం వాల్చుకుని, దానిమీద చుట్ట కాలుస్తూ కూచున్నాడు. రాత్రి ఒకఝాము గడించింది. నిద్రపోదామని లేచి నుంచోగానే, ఎవరో అపరిచిత వ్యక్తివచ్చి "వందేమాతరం" అని నెంపాదిగా అరిచాడు.

ఆమాట వినగానే కల్లూ ఉలికిపడ్డాడు. "ఎవరా" అని వీధిలోకి చూసేప్పటికే సన్యాసులవలె కషాయవస్త్రం కట్టుకుని ఎవరో, కనిపించాడు. కల్లూ సందేహిస్తూ "ఎవరు వారు ?" అన్నాడు.

"సన్యాసిని."

కల్లూ వీధిగుమ్మముపద్దకు వచ్చి, సన్యాసికి నమస్కారము చేసి, "రండి, లోపలికిరండీ" అన్నాడు.

పిలవగానే సన్యాసి లోపలికి వెళ్ళెను. దీపపు వెలుతురులో చూడగా, సన్యాసి వయస్సు ఇరవై సంవత్సరములకు మించి వుండదని తోచింది. అందమైన శరీరం- ఎఱ్ఱనిఛాయ- ఇంత అందమైన బాలసన్యాసిని కల్లూ ఎప్పుడూ చూడలేదు. అందువల్ల సన్యాసిపైన అతడికి ఒక్కసారిగా భక్తి విశ్వాసాలు అంకురించాయి. వెంటనే పీట వేసి "దీనిమీద కూర్చోండి" అని ఆ పీట చూపించాడు.

సన్యాసి పీటమీదకూర్చున్నాక, కల్లూ చేతులుజోడించి "ఏంపని మీద దయచేశారు, బాబూ" అన్నాడు.

"సన్యాసి మధురమైన గొంతుతో ఈ రాత్రి యిక్కడ పడుకునేందుకు వీలవుతుందా?" అని అడిగాడు.

కల్లూ ఆదరముతో. "తమలాటి మహాత్ములకు కరువవుతుందా బాబయ్యా, ఇదంతా తమదే." ఒసేవ్ ! అయ్యగారికి కాళ్ళు కడుక్కునేందుకు నీళ్ళుతీసుకురా! అన్నాడు.

కల్లూ భార్య భోంచేసి, మరుగున నుంచుని యిదంతా చూస్తూనేవుంది. కల్లూ పిలుపువినగానే, వెంటనే నీళ్ళుట్టుకు వచ్చింది, కల్లూ సన్యాసి పాదములను కడుగసాగాడు.

ఇంతలో కల్లూభార్య 'ఏమీవుచ్చుకున్నట్టు లేదు బాబూ?' అన్నది.

"భోజనం సంగతేనా?"

"అవునండీ."

సన్యాసి మందహాసముచేసి దారిలో ఏవో పండ్లు తిన్నాను. ఆకలి దప్పికలను సహిస్తూ వుండటం మాసాంప్రదాయం. అందువల్ల భోజనం లభించినప్పటికీ తినము. ఇవ్వాళ ఏమీ తినను!

కల్లూ సన్యాసి పాదములనుతుడిచి "అల్లాకాదు బాబూ! గృహస్థుయింట సాధువులూ- సన్యాసులూ ఆకలితో వుండటం మహాపాపం. అది మాకు జయంకాదు. అనుగ్రహించండి.'

కల్లూ భార్య – మేము చాలా బీదవాళ్ళం. మిమ్మల్ని మర్యాదచెయ్యగలశక్తిలేదు మాకు. అయినా ఇంట్లోబియ్యం, పిండి, పప్పు, బంగాళాదుంపలూ వున్నాయి. మాతోపాటు కలో-గంజో తాగితే మా భాగ్యంగా తలుస్తాం బాబూ!

బీదగృహస్థు ప్రార్థనవిని సన్యాసి 'సరే, సామగ్రి తీసుకురండి' అనెను.

'పద, బిందెతో నీళ్ళుతీసుకురా. ఈలోగా నేను పొయ్యి రాజేస్తాను' అని కల్లూ భార్యతో చెప్పి పంపించాడు.

## 3

చూస్తూవుండగానే అంతా సిద్ధమయింది. సన్యాసి వంట ప్రారంభించాడు. అభ్యాగతులకు ఏ సమయాన ఏవస్తువు

కావలసివస్తుందోనని, కల్లూ, కల్లూ భార్య-యిద్దరూ సన్యాసికి కొంచెందూరంగా కూర్చుని వున్నారు.

సన్యాసి వంట చేసుకుంటూ ఎన్నో ప్రశ్నలు వేయ సాగాడు. లాల్ గంజ్‌లో సాలీలు ఎవరెవరున్నారు?— ఇచ్చటి సాలీల స్థితిగతులు ఎలావున్నాయి?—గ్రామంలో ధనికులు ఎవ రెవరు?—వాళ్ళస్వభావం ఎలాటిది?—మొదలైన ఎన్నో సంగతు లను అడిగి తెలిసికొన్నాడు. కల్లూ స్థితిగతులను గురించికూడా అడిగెను. కల్లూ, కల్లూ భార్యా తమ దారిద్ర్యాన్ని గురించి చెప్పుకుని ఏడ్చిరి. ఒకప్పుడు తాము ఐశ్వర్యంతో వుండేవాళ్ళ మన్ని కూడా చెప్పారు. కల్లూ ఎంత అడ్డగించినను వినక, కల్లూ భార్య శుక్లజీ తమ ఆస్తినంతను ఎలా మోసంచేసి కబళిం చాడో అదికూడా చెప్పింది. అతడు ఎలా ధనికుడుఅయిందీ కూడ వర్ణించింది.

అప్పుడు, సన్యాసి మగ్గాలనుగురించి వివిధప్రశ్నలను వేసెను. పూర్వం ఎలా వుండేదీ?— ఇప్పుడు ఎలావుంటు న్నదీ?— స్త్రీలు నూలు వడుకుచున్నదీ లేనిదీ?— ఈ నూలుతో బట్టలు వడకితే విదేశీబట్టలకంటె చౌకగా అమ్ముడుపోయేదీ - పోనిదీ - మొదలైన ఎన్నో ప్రశ్నలను అడిగి తెలిసికొన్నాడు. తన కులవృత్తిని గురించి యింతగాఅడిగి తెలసికోనేప్పటికీ కల్లూమొగం వికసించింది. అతడు సాలీల పూర్వస్థితినీ, యిప్పటి స్థితినీ గురించి వివరంగాచెప్పాడు. తమ పూర్వులు యీ గ్రామంలో వుండే సాలీలకు కులపెద్దగా వుండేవారనీ, ఎప్పుడూ తమ యింట్లో బ్రాహ్మణ సంతర్పణలు జరుగుతూవుండేవనీ,

అలాంటి తాము నేము తినుటకు తిండిలేని స్థితిలో వున్నామనీ చెప్పి, పడిపోయిన పెంకుటింటి భాగములను దీపవు వెలుతురులో సన్యాసికి చూపించాడు. వారి దుస్థితిని చూచి సన్యాసి చాలా దుఃఖపడ్డాడు. కల్లూ కన్నీటిని ఆపుకోన జాలకపోయెను.

కల్లూ ఏడ్చుచుండుటను చూచి సన్యాసి "కల్లూ ఏడ్వకు. మీ కష్టములు తీరిపోయే రోజులు వచ్చినవి. ఇప్పుడు ప్రతి వారికీ స్వదేశీవస్తువులపై అభిమానము వృద్ధి అవుతోన్నది. కొద్దిరోజులలోనే మీకు చేతినిండాపని దొరకగలదు. దేశ పరిశ్రమలు, అందునను వస్త్రపరిశ్రమపై భగవానుని శుభ దృష్టి పడ్డది. నాలీల ఏడ్పునుపని భగవానుడు దయ తలచినాడు. ఏడవబోకు" అని ఓదార్చెను. కల్లూకు, ఈ మాటలు వినేటప్పటికే సన్యాసిపై మరింత గౌరవభావం కలిగింది. ఆతడు భార్యతో రహస్యముగ "చూశావా వీరుచెప్పేది. అంతా నిజంగా జరుగు ననిపిస్తోంది. చాలాగొప్ప సాధువులు లాగా వున్నారు !

"నాకూ అలానే అనిపించింది. ఆయన మొగాన్ని చూశావా? రాజులాగ మొగంలో కళవుంది. ఎవరో దేవుడు— మనుష్యరూపాన్ని ధరించి వచ్చి వుంటాడు. తాయత్తు సంగతి అడగండి !

"నువ్వే అడుగు !"

కల్లూ భార్య ఆకస్మికంగా తాయత్తును గురించి ప్రశ్నించలేకపోయింది. అయిదు నిముసముల వరకు ఎవరూ— ఏమీ— మాట్లాడలేదు.

చివరకు సన్యాసి ఏవో ఒకటి రెండు సంగతులను అడి గాడు. అప్పుడు, కల్లూ భార్య "ఒకమనవి వుంది బాబూ" అంది

"ఏమిటో చెప్పు"

"తప్పు చేశాను బాబూ!"

"ఏమిటది ?"

కల్లూ భార్య తాయత్తు విషయంలో జరిగిన సంగతంతా తనూ చెప్పింది. మాటల సందర్భంలో దానిని ఎందుకు అమ్మ వలసి వచ్చిందో కూడా చెప్పింది. ఆ తావీజు లేకపోవటం తన భర్తకు చాలా అశుభమని కూడా చెప్పింది. ఇదంతా విని సన్యాసి "ఏది ఆ భోజపత్రం? ఏమి వ్రాసివుందో చూస్తాను ?" అని అడిగినాడు.

కల్లూ భార్య ఆభోజపత్రాన్ని తీసుకువచ్చి యిచ్చింది. సన్యాసి దానిని జాగ్రత్తగా పరీక్షించి చూచెను. దానిమీద ఏవో రెండు మూడు మచ్చలు తప్ప ఏమీ కనిపించలేదు. ఆ మచ్చలే ఒకప్పుడు అక్షరములై యుండవచ్చును. కాని అవేవో స్పష్టముగా తెలియుటంలేదు. సన్యాసి దానిని పొట్లములో చుట్టి "జాగ్రత్తగా పరీక్షచేసి చెపుతానులే" అని తన దగ్గిర వుంచుకున్నాడు.

కల్లూ భార్య - శుక్లజీని అడుగుదామని అనుకున్నాము. మా అదృష్టవశాత్తూ మీరు మా యింటికి వచ్చారు. దీన్ని జాగ్రత్తగా పరీక్షచేసి ఆలోచించి చెప్పండి. ఏఆపత్తూ రాకుండా చూడండి బాబూ, అని అమాయకంగా అన్నది.

సన్యాసి ఏమీ అనకుండా వంట చేసుకుంటున్నాడు. తావీజు అమ్మటానికి సంబంధించిన కరుణగాధ అతనికి తీరని మనోవేదనను కలిగించింది.

కొంచెము సేపైనతరువాత సన్యాసి ఆకస్మికంగా— "చూడు, నీకుచాలా డబ్బువస్తే, ఏంచేస్తావు ?'' అని కల్లుగాను చూచి ప్రశ్నించాడు.

"ఎన్నిరూపాయులు బాబయ్యా?"

"వెయ్యా-రెండువేలో-కాకపోతే ఐదు వేలు".

కల్లాభార్య ఆసక్తితో-మీకు బంగారం చెయ్యటం తెలుసునా బాబయ్యా? అని అడిగింది.

కల్లా మెదలకుండా భార్యను అపుచేసి - "వూరుకో. అయ్యగారికి మనమీద దయకలిగింది''. అని, బయటకు, బాగా డబ్బుండే యాత్రలుచేస్తా బాబయ్యా; ధర్మంకూడా చేస్తాను బాబయ్యా!''అన్నాడు.

"ఇంతేనా? ఇలాచేస్తే లాభం ఏముంది''.

"ఏమో! నాకేం తెలుస్తుంది బాబయ్యా? తమరేశెల విప్పండి బాబయ్యా, ఏంచెయ్యమంటారో''

"నేను చెప్పినట్టుచెయ్యి. దేవుడికి దయగలిగితే అయిదువేల రూపాయిలు యిస్తాడు".

"అలాగే బాబయ్యా"

వంటఅయింది. అన్నపుగిన్నెదించి, కాళ్ళు చేతులు కడుక్కొని, కల్లా కల్లాభార్యకూ దగ్గరగా సన్యాసివచ్చి కూర్చుని.

"దేవుడు మీకు అయిదు వేల రూపాయలు యిస్తే"-!

కల్లూభార్య మాటమధ్యగా అడ్డువచ్చి "ఎలాయిస్తాడు బాబయ్యా?"

సన్యాసినవ్వి—దేవుడు ఎవరికన్నా తనచేత్తోయిస్తాడా? ఎవరితోనన్నా యిప్పిస్తాడు. కల్లూ, దేవుడునీకు అయదు వేల రూపాయలు యిస్తే, అందులో ఒక వెయ్యి రూపాయలు నీ స్వంత ఖర్చుకు యిచ్చాడనుకో. వాటితో నీ యిష్టంవచ్చిన ఖర్చు చేసుకో. మిగతా నాలుగు వేలూ మగ్గాలకు ఖర్చుపెట్టాలి. ఆడబ్బుతో ఒక కార్ఖానా ప్రారంభించు. వీలైనన్ని మగ్గాలు పెట్టి-వూళ్ళోవున్న సాలీలను అందర్నీ నౌకరులుగా పెట్టుకుని, బట్టలునేయించు. ఆ బట్టలను లాభంలేకుండా – నీకు ఎంతకు గిడితే అంతకు అమ్మాలి నేం, చెయ్యగలవా?"

కల్లూ ఉత్సాహంతో "ఎందుకు చెయ్యలేను? మా వృత్తే అదిగా!"

"లాభం తీసుకోనేందుకు వీల్లేదు. గిట్టినధరకే అమ్మాలి సుమా!"

"లాభంతీసుకుంటే—"

"వద్దులే, ఒట్టుపెట్టుకోవద్దులే నీకు యిచ్చే వెయ్యి రూపాయలూ, నీ యిష్టం వచ్చినట్టు ఖర్చుపెట్టుకో!"

"అలాగే బాబయ్యా!"

"అయితే విను. నీకు అయిదువేల రూపాయలు వస్తాయి. ఎలా వచ్చేదీ కూడా చెపుతాను విను. దేవుడునీకు శుక్లజీ చేత్తోనే యిప్పిస్తాడు."

కల్లూ భార్య —"శుక్లజీ చేతికివస్తే-ఆయనే కాజేస్తాడు బాబయ్యా.

సన్యాసి నవ్వి' దేవుడి డబ్బును కాజెయ్యటం సామాన్యంకాదు. శుక్లజీ ఎలా యిచ్చేదీకూడా చెబుతానువినండి మీ పాడు పడ్డ యిళ్ళస్థలం కొనాలని శుక్లజీకి బుద్ధిపుడుతుంది. ఇలా దేవుడే చేస్తాడు. మొదట్లో కొద్దిగాడబ్బిస్తాను యివ్వమంటాడు. ఇవ్వనను క్రమక్రమంగా ఎక్కువయిస్తానంటాడు. ఐదు వేలు యిస్తాననే టంతవరకు వొప్పుకోవద్దు. ఐదు వేలు యిచ్చేందుకు వొప్పుకున్నప్పుడు 'సరే' నను ఐదువేలూ తీసుకుని యిచ్చెయ్యి రొఖ్ఖం తీసుకో బాకీ వద్దు".

"అలాగే."

"ఇంకొక సంగతి. మనం మాట్లాడుకున్న సంగతులు ఎవరికీ తెలియనివ్వరాదు సుమా! ఎవరిచెవిని పడ్డా, చేసినదంతా చెడుతుంది. రాగిదమ్మిడీ కూడా రాదు, చివరకు, నేను వచ్చిన సంగతికూడా ఎవరికీ తెలియగూడదు."

కల్లూ (భార్యంతో) "ఒసేవ్ వింటున్నావా? నీ నోట మాట దాగదు. జాగ్రత్త అని తర్జనితో శాసించాడు,

కల్లూ భార్య చేతులు నలుపుకుంటూ "నేను అలాంటి దాన్నికాదు. ప్రాణంపోయినా సరే, ఎవరికీ చెప్పను" అంది.

సన్యాసి – సరే ఇక వెళ్ళి పడుకోండి. జపం చేసుకుని భోంచేస్తాను. బాగా పెందలకడ లేచి నన్ను నిద్రలేపండి. బాగా చీకట్లువుండగానే, నేను వెళ్ళిపోవాలి.

కల్లూ చేతులు జోడించి — "తమరు భోంచెయ్యండి. మాకేం తొందరలేదు. తరువాత పడుకుంటాము."

"కాదు- మీరు వెళ్ళండి"

సన్యాసికి పడుకొనుటకు చోటు చూపించి, భార్యా-భర్తలిద్దరూ వెళ్ళిపోయాక. సన్యాసి జోలినుంచి భగవద్గీతను తీసి పారాయణ చేయసాగాడు.

## 4

బాగా చీకటి వుండగానే భార్యాభర్తలు యిద్దరూ వచ్చి సన్యాసిని మేల్కొలిపారు.

సన్యాసి వెళ్ళిపోతూ "తావీజు లోపలవున్న భోజపత్రం మీద చాలా మంచియంత్రం వుంది, (కల్లూ భార్యవైపుచూసి) కొంచెం పొద్దు ఎక్కిన తరువాత దీనిని శుక్లజీవద్దకు తీసుకువెళ్ళి చూపించు. తావీజు విరిచెయ్యటంవల్ల యంత్రం సరిగా కనపించటంలేదు. శుక్లజీ సరిచేసి, రాగి తావీజులో పెట్టి మూసి యిస్తాడు. దాన్ని "మెడలో కట్టుకో, ఏ బాధారాదు" అని భోజపత్రమును ఆమెకు తిరిగి యిచ్చివేశాడు. కల్లూ తన కొడుకునూ, కూతురునూ తీసుకునివచ్చి "వీళ్ళని దీవించండి బాబయ్యా, మీపాదధూళి వీళ్ళ నుదుట పెట్టండి బాబూ" అని ప్రార్థించాడు.

సన్యాసి బిడ్డలను యిద్దరినీ ఆశీర్వదించి వెళ్ళిపోయాడు.

కొంచెం ఎండ ఎక్కగానే కల్లూ భార్య శుక్లజీ యిం టికి వెళ్ళింది. శుక్లజీ ఆ సమయాన జప, పూజాదులు నెర వేర్చుకుని దుకాణమునకు వెళ్ళబోవుచుండెను.

కల్లూ భార్య అతనికి నమస్కారముచేసి "చాలాకష్టాల్లో వున్నాం బాబయ్యా!"

శుక్లజీ ఏదో అప్పు అడుగుటకు వచ్చిందనుకుని విసు గుతో "ఏమంటావు?" అనెను.

కల్లూభార్య తావీజు సంగతి నంతనూ చెప్పింది. తన భర్త భయపడుచున్నాడనికూడా చెప్పి "ఈమహిమ బంగారంది కాదు బాబయ్యా, మంత్రందే. ఈ యంత్రాన్ని రాగి తావీ జులో పెడితే, దీని మహాత్తు పోతుందా బాబయ్యా?"

"రామ కవచమా? శివ కవచమా?

"నాకేం తెలుస్తుంది బాబయ్యా! చూసి చెప్పండి" అని భోజపత్రాన్ని శుక్లజీకి యిచ్చింది.

శుక్లజీ జేబునుంచి సులోచనములుతీసి, దానిపై నున్న అక్షరములను చదివెను. చదువగానే అతనిముఖ కవళిక మారి పోయెను. కాళ్ళు, చేతులు వణకసాగెను. అందుచే అచ్చట వున్న మంచముపై కూలబడ్డాడు

కల్లూభార్య సంశయిస్తూ "ఏమిటి బాబయ్యా?" అని అడిగింది. శుక్లజీ రెండు చేతులతోను తలపట్టుకుని, "అబ్బే ఏమీ లేదు. హఠాత్తుగా తల తిరిగింది."

"ఎవరినన్నా పిలవమంటారా?"

"వద్దు వద్దు. తగ్గిపోతుందిలే. ఏమని చెబుతున్నావు? ఇది ఎక్కడ దొరికింది?"

"మాయింట్లో చాలా రోజుల్నుంచీ వుంది. ఏడు తరాల నుంచీ వున్నదని మా అత్తగారు చెబుతూ వుండేది. మా అత్తగారికి ఆమె అత్తగారు యిచ్చిందిట. ఆమె నాకు యిచ్చింది, నా తరవాత నా కోడలుకు యివ్వమనీ, జాగ్రత్తగా దాచి వుంచమనీ చెప్పింది."

"అయితే చాలా పాతదన్న మాట. అయినప్పటికీ మంత్రం బాగానే వుంది. ఇలాటి మంత్రం యీరోజుల్లో దొరకదు. దీన్ని తాయత్తులో పెట్టినంత మాత్రాన లాభం లేదు. విరిగి పోవటంవల్ల, మైల తగలటం వల్లా దీని శక్తి తగ్గిపోయింది. పూజచేసి శుద్ధి చెయ్యాలి. శుద్ధి చేసేందుకు మంచిరోజు చూడాలి. అయితే ఒక పనిచెయ్యి. దీన్ని నాదగ్గరవుంచి వెళ్ళు. మంచిరోజు చూసి శుద్ధిచేసి, రాగితాయత్తులో పెట్టియిస్తాను."

"సరే, వుంచండి."

శుక్లజీ గొంతును సవరించుకుని, దయాపూర్ణవదనంతో "వొట్టి పిచ్చిదానవే. మాయింటికి వచ్చి అడుక్కుంటే కాస్త అన్నం పెట్టక పోయామా? తావీజు అమ్ముకుంటారటే? ఇందుకే అంటారు సాలీలకు బుర్రలేదని!"

"అంత తెలివే వుంటే యిలా ఎందుకు అవుతాం బాబయ్యా?"

"అదే అంటున్నాను. సరే, పద, చాలా ఆలశ్యం అయిం ది-దుకాణానికి వెళ్ళాలి'' అని శుక్లజీ దుకాణమునకు వెళ్ళి పోయాడు.

మర్నాడు ఉదయాన శుక్లజీ కల్లూకు కబురుచేశాడు. కల్లూ రాగానే శుక్లజీ "నిన్ను ఒక సంగతి అడిగేందుకు పిలి చాను. మీా యిల్లంతా పడిపోయిందికాదూ?'' అన్నాడు.

"పొట్టకే గడవనప్పుడు, యిల్లెక్కడ బాగు చేయించను బాబయ్యా? పూరిల్లు, యేటా మరమ్మతు చేసుకోవలసిందే బాబయ్యా?"

"ఇక్కడ పల్లెవాడు వుండేవాడు ఎరుగుదువుగా! వాడు యీావూరునుంచి లేచిపోతే, ఆయిల్లు నేను కొన్నాను!"

"మరే బాబయ్యా."

"అందులో రెండుగదులు, రెండుకొట్లూ, వంట యిల్లూ, పశువులసావడి, రెండు మామిడిచెట్లు వున్నాయి. ఆ యింట్లో వెళ్ళి వుండరాదూ? నీ యింటికిబదులు దాన్ని యిస్తాను."

సన్యాసి చెప్పినసంగతి మూడురోజుల లోపలనే జరుగ బోవు చున్నందుకు కల్లూ శరీరం అంతా ఒక్కసారిగా పులక రించిదిం. పైకి తెలియకుండా సంబాళించుకుని "మా యింటిని తీసుకుని ఏం చేస్తారు బాబయ్యా?"

"ఏమీా లేదురా శివాలయం కట్టిద్దామని వుంది. ఏం యిస్తానంటావా? నీకేం నష్టం లేదు-లాభమేగానీ. అలాంటి మంచియిల్లు, మంచి మామిడిచెట్లు వూరికే నీకు వస్తున్నాయి

కల్లూ కొంచెంసేపు యోచించి "మా తాత తండ్రులు ఏడు తరాలనుంచీ వుంటున్నయిల్లు బాబయ్యా."

శుక్లజీ విషపునవ్వునవ్వి "సాలివాడివి కాదురా! ఏడు తరాలనుంచీ వుంటే ఏం? అలాటి మంచి యిల్లు వూరికే వస్తుంటే. ఎవరు వద్దంటారురా?"

కల్లూ ఏమీ జవాబుచెప్పలేదు. తలవంచుకుని నిలబడి పోయాడు.

శుక్లజీ మళ్ళా ఒకనవ్వు నవ్వి "నీవుద్దేశం తెలిసిందిలే. నాయింటి ఆవరణ పెద్దది. యిది చిన్నది, పెద్దదియిచ్చి చిన్నది తీసుకోటం ఎందుకు? అని ఆలోచిస్తున్నావు; అంతేనా."

"అవును బాబయ్యా."

శుక్లజీ పకపకనవ్వి "సాలెవాడికి తెలివి వుండదంటారు, ఎవరునమ్ముతారు! సరేలే, నీయింట్లో ఎక్కువ వున్న స్థలానికి వందో, రెండువందలో డబ్బు యిస్తానులే, తీసుకో, ఏం, నచ్చిందా?"

కల్లూ ఏమీ జవాబివ్వలేదు.

"భార్యాసలహా తీసుకోనిదే ఏమీచెప్పదలచుకో లేదనుకుంటాను. సరే వెళ్ళు. ఆలోచించి మూడోఝాము వేళ వచ్చి ఏసంగతీ చెప్పు. రెండువందలరూపాయలురొఖం, ఆయిల్లూ వస్తాయి. నీ చుట్టూవున్న ఆవరణఅంతా యిచ్చెయ్యాలి సుమా!

కల్లూ నమస్కారముచేసి వెళ్ళిపోయాడు.

మూడవరఘూము కాగానే శుక్లజీ కల్లూరాకకై ఎదురు చూస్తూ కూచున్నాడు. కాని, కల్లూరాలేదు. ప్రొద్దుక్రుంకే సమయాన తానే స్వయంగా కల్లూయింటికివెళ్ళి "ఏరా కల్లూ, ఇద్దరూ ఏమని ఆలోచించుకున్నార్రా?"

కల్లూ తలవంచుకుని "ఏళ్ళతరాలనుంచీ వుంటున్న యింటిని, వదలబుద్ధికావటల్లేదు బాబయ్యా!"

"మాట్లాడినప్పుడల్లా యిదొకటి నేర్చావు!"

శుక్లజీ యింటి నాలుగువైపులా తిరిగిచూచి "శివాలయాన్ని కట్టిద్దామని నా కెంతో ముక్కువగావుంది. ఇందుకనే నిన్ను యింతగా అడుగుతున్నాను. లేకపోతే నేనేం చేసుకోను యీ యింటిని? పోనీలే, రెండువందలుచాలకపోతే, యింకొంచెం ఎక్కువగాతీసుకో. అయిదువందలరూపాయిలూ, ఆయిల్లూ యిస్తానులే."

కల్లూ జవాబివ్వలేదు. శుక్లజీ కల్లూ మొగము వంక చూసి, "ఏమంటావు?" అన్నాడు.

"యివ్వటానికి యిష్టంలేకుండావుంది బాబయ్యా. పిత్రార్జితపుయిల్లు అమ్మేస్తే నలుగురూ నిందిస్తారని భయమేస్తోంది బాబయ్యా."

"హుం — నలుగురూ నిందిస్తారనా? ఒకపూటతింటే రెండోపూటకు గతిలేదు. అయిదువందలరూపాయలు యిస్తున్నాను. నీ జీవితంఅంతా అన్న - వస్త్రాలకు లోటులేకుండా కాలుమీద కాలు వేసుకుని కూర్చోవచ్చు. నువ్వేం యిస్తావులే సుఖపడే గీత లేనప్పుడు."

అని శుక్లజీ మళ్ళానాలుగువైపులా తిరుగసాగాడు. పడి పోయిన యిటుకగోడల దగ్గరనుంచుని.(లోలోపల) ఈయిటుక చాలా గట్టిగావుంది; ఇలాటి యిటుకలు యీ రోజుల్లో దొరకనేదొరకవు. యిప్పటి యిటుకలు చెయ్యిజారి కిందపడ గానే విరిగిపోతాయి ఆ కాలపువి గనక సుత్తితోకొట్టినా పగ లనంత గట్టిగావున్నాయి. ఈ పడిపోయిన యిటుకలే అయిదు వందలరూపాయలు చేస్తాయి. అని ఆలోచించి, (బయటకు), "కల్లూ, నేను డబ్బు ఎక్కువగా యిస్తానంటున్నకొద్దీ, నువ్వు బెట్టు చేస్తున్నావు. సరే, విను. ఈ యిటుకకూడా యిచ్చేస్తే వెయ్యి రూపాయలు రొఖ్ఖం, ఆయిల్లూ యిస్తాను, అంతే, అంతకంటె ఒకదమ్మిడీకూడా ఎక్కువయిచ్చేది లేదు. నాకు మటుకు ఎక్కడినుంచి వస్తుంది? నేనుకూడా గృహస్థునే; భార్యా, బిడ్డలు వున్నవాడినే. ఇస్తే సరే. లేకపోతే దేవా లయం సంగతేమా నేస్తాను." అని శుక్లజీ కల్లూవైపు చూడ సాగెను.

కల్లూ ఏమీ జవాబు చెప్పలేదు.

శుక్లజీ కల్లూ భార్యవైపు చూచి "కల్లూ పెద్దవాడై పోయాడు. వాడిబుద్ధి స్థిరంగా వుండటంలేదు. నువ్వింకా చిన్న దానివి. ఈ యింటిని వందరూపాయలకుకూడా ఎవరూ అడగ రని నీకు తెలుసు. అలాటిదానికి వెయ్యిరూపాయలు రొఖ్ఖమూ, మంచి యిల్లూ యిస్తానంటున్నాను. పల్లెవాడి యిల్లు నువ్వు చూసేవుంటావు? కల్లూకు నచ్చజెప్పరాదూ? వెయ్యిరూపాయ లంటే సామాన్యం అనుకున్నావేమో? మీరు బియ్యం

పోసుకునే కుండ వుంది చూశావూ, దానెడు రూపాయలు వస్తాయి. పూజ చేసుకునే వేళఅయింది. యిక వెళతున్నాను. నీ భర్తకు నచ్చచెప్పు. ఇద్దరూ రేపు వుదయం మాయింటికి రండి. దస్తావేజులు రాసుకుందాము. వెయ్యి రూపాయిలూ రిజస్ట్రారుఆఫీసులో యిస్తాను తెలిసిందా?

మరునాడు కల్లూగాని, కల్లూభార్యగాని ఎవరుకూడా శుక్లజీ యింటికి వెళ్ళలేదు. అందువల్ల శుక్లజీ వీరికి కబురుపంపి పిలిపించుకొని, "ఏంచేశారు?" అని ప్రశ్నించాడు కల్లూ "చేశేదేముంది బాబయ్యా. అమ్మదలచుకో లేదు." అన్నాడు.

"ఎందుకని?"

"ఇన్ని తరాలనుంచి వున్నదాన్ని అమ్మటమే? మాకు జయముకాదు బాబయ్యా."

"బయల్దేరావు లేవోయ్, పెద్ద పండితుడివి! జయం కాదూ! ఎందుకుకాదు? నీ యింట్లో ఎవరూ మాంసపు దుకాణం పెట్టట్లేదే. దేవాలయం కడుతున్నారు. రాత్రింబవళ్ళు దీపారాధన వుంటుంది" పూజలు జరుగుతూ వుంటాయి. మీ ఏడు తరాల వాళ్ళూ తరిస్తారు తెలిసిందా?"

కల్లూ ఎప్పటివలెనే జవాబివ్వలేదు. కొంచెము సేపుండి శుక్లజీ మరల. "సరేలే, ఎంతకు యిస్తావో చెప్పు," అన్నాడు.

కల్లూ జవాబివ్వలేదు.

"రెండువేలు కావాలా?"

కల్లూ అప్పటికీ జవాబివ్వలేదు.

"వేళ్ళాకోళం అనుకుంటున్నావేమో; నిజంగానే రెండు వేల రూపాయలూ యిస్తాను. మహాదేవ బాబా స్వప్నంలో కనిపించి కల్లూ యిళ్ళస్థలం చాలా పవిత్రమయిందనీ, అక్కడ దేవాలయం కట్టించి నన్ను స్థాపించవలసిందనీ చెప్పాడు. అందు వల్లనే యింతగా అడుగుతున్నాను. లేకపోతే దేవాలయం కట్టించేందుకు స్థలానికే కరువు వచ్చిందా ఏం? అన్నం తిని రా. దస్తావేజు వ్రాసుకుందాం. రేపు మంచిరోజు. కచ్చేరికి వెళ్ళి రిజష్టరీ చేయించుకు వద్దాం అక్కడే రెండువేల రూపాయలూ లెక్కపెట్టి యిస్తాను. సరేనా?"

"ఇవ్వను బాబయ్యా"

శుక్లజీ నిట్టూర్పు విడిచి "శాస్త్రిల్లో అదృష్టానికి తగ్గ బుద్ధే వుంటుందన్న"మాట యథార్థమే. నీకు సుఖపడే గీత లేనప్పుడు, నీకు మంచిబుద్ధి ఎలా పుడుతుంది." ఇలావిను. పూర్వకాలంలో ఒక బీద బ్రాహ్మణుడు వుండేవాడట. పొట్టకు సరిపోనుకూడా లేదట. చివరకు పిల్లలకు కడుపునిండా తినే మాత్రంకూడా లేదట. ఆ బ్రాహ్మడు ప్రతిరోజూ యాయ వారం చేసుకుంటూ వుండేవాడట" ప్రతిరోజూ ఏడు గ్రామాలలో ముష్టెత్తుకుని సాయింత్రికి యింటికి వచ్చేవాడు. ఇలా, ఒకరోజ సాయంత్రం యింటికివస్తున్నాడు ఆసమయంలో శివుడు, పార్వతి రథంలో కూర్చుని ఆకాశంలో విహరిస్తూ వున్నారు. ఆబ్రాహ్మణుని చూచి పార్వతి జాలితో "ప్రాణనాథా! యీ బ్రాహ్మణుని చూడగానే నాకుచాలా దుఃఖం కలుగుతూవుంది. ఎండఅనక, వానఅనక ప్రతిరోజూ ఏడుగ్రామాల్లో

ముట్టెత్తుకోవాలి. అప్పటికికూడా కడుపునిండ తిండి దొరకటల్లేదు. ఇతడి కష్టాలుతొలగిపోయేటట్టు, కొంతధనం యివ్వండి'' అని ప్రార్థించింది. అదివిని శివుడు నవ్వి "వెఱ్ఱి దానా! అతడికి ఐశ్వర్యరేఖలేనిదే-ఐశ్వర్యం ఎలాయివ్వగలను? అన్నాడట. అప్పుడు పార్వతి "మీరుగూడా యిలాగేమాట్లాడితే ఎలా! మీరు ఐశ్వర్యం యిస్తేకూడా దరిద్రుడుగానే వుంటాడా!'' అని ఆశ్చర్యముతో పార్వతి అంటే దానిపై శివుడు "అయితే చూడు ఇతడు వెళ్ళేదారిలో ఒక మొహరీల సంచి పడవేస్తాను. అది వీనికి దొరకున్నో లేదో చూడుమని'' శివుడు మొహరీలసంచిని పడవేసెను. ఇంతలో బ్రాహ్మణునకు దుర్బుద్ధిపుట్టి "నేను ప్రతిరోజు యీ దారినే వస్తూపోతూ వున్నాను ఈదారి నాకు పాతది అయిపోయింది. కళ్ళుమూసి కొనికూడా పోగలిగినంత పాతదిఅయింది. అయినా వెళ్ళగలనో లేదో చూతమని'' మొహరీలసంచిని దాటిపోవునంతవరకు కనులను మూసికొని నడిచిపోయాడు. నీ స్థితికూడా అదేవిధంగా వుంది, రెండువేలరూపాయలు యిస్తానంటే వద్దంటున్నావు. సరే. యిప్పటికివెళ్ళు, ఆలోచించుకునివచ్చి మధ్యాహ్నపువేళ ఏ సంగతీ చెప్పు."

కల్లూ, కల్లూభార్య - యిద్దరూ నమస్కారముచేసి శలవుతీసుకు యింటికి వెళ్ళిపోయారు.

ఇంటికి వెళ్ళిన తరువాత కల్లూ భార్య. ఏమండీ, శుక్లజీ రెండువేలరూపాయలు యిస్తానంటూంటే యిల్లు యివ్వగూడ

దూ? మరీ ఆశకుపోతే" దురాశ దుఃఖించేటు అన్నట్టవు తుం దేమో! అంది.

"సాధూగారు అయిదువేల రూపాయలు వస్తాయని చెప్పలేదటే."

"శుక్లజీ అయిదు వేలరూపాయలు యిస్తాడా! వచ్చినంత వరకూ తీసుకుంటం మంచిది. చేతికి వచ్చిన లక్ష్మిని పోగొట్టు కోరాదు."

వెఱ్ఱిదానా, అయిదువేల రూపాయలూ నాకోసం యిస్తున్నాడుటే! అయిదు దమ్మిడీలుకూడా యివ్వనివాడు- అయిదువేలు యిస్తాడా! దేవుడు యిప్పిస్తున్నాడే. సాధు బాబా చెప్పలేదటే!"

"చెప్పినమాట నిజమే. ఆయనేమన్నా దేవుడా యేమిటి చెప్పిందంతా జరిగేందుకు ఆయనకూడా మనిషేగా."

కల్లూ కోపముతో "ఛీ! అలా మాట్లాడకు! వారు సాధువులు - వారిమాట అబద్ధం అవుతుందా? అలా అను కుంటే పాపం వస్తుంది. నాకు ఐదువేల రూపాయలూ వచ్చి తీరుతాయి" అన్నాడు.

అలాగే జరిగింది. శుక్లజీ ఆ మర్నాడు మూడువేలు, మూడవనాడు నాలుగువేలూ యిస్తానన్నాడు. అప్పటికికూడా కల్లూ వొప్పుకోలేదు. చివరకు గత్యంతరము లేక కల్లూను పిలిపించుకుని "కల్లూ, నీకు పరలోక భీతి లేదూ? అన్నాడు.

"ఏం బాబయ్యా?"

"నిన్ను యింతకా బ్రతిమాలి, నాలుగు వేల రూపా యలు యిస్తానన్నప్పటికీ, నువ్వు వొప్పుకోటల్లేదు! మహా దేవుడు నాకు కలలో వచ్చి చెప్పాడు. "నీయింటిస్థలం ఆయనకు ప్రియమైనదని" ఆ స్థలంలోనే దేవాలయం కట్టిస్తే మా వంశంలో ఎవరికీ ఎప్పుడూ ఏ కష్టమూ రాకుండా చేస్తాననీ, అంతా రాజువలె సుఖం అనుభవించేట్టు వరం యిస్తాననీ చెప్పాడు. ఇందుకనే నిన్ను యింతగా అడుగుతున్నాను. నువ్వు నాకాస్థలం యిస్తే, ఒక బ్రాహ్మణవంశాన్ని ఎల్లకాలం సుఖంగా వుండేట్టు చేసిన పుణ్యం వస్తుందనీకు. లేకపోతే బ్రాహ్మణ వంశాన్ని దుఃఖపెట్టిన పాపం వస్తుంది."

కల్లూ కొంచెంసేపు వూరుకుని "నాలుగు వేలరూపా యలూ యిస్తారా?"

"ఆ, నాలుగువేలు రొఖ్ఖం."

"ఆ యిల్లుకూడానా?"

"ఆ"

"మీరింతగట్టిగా చెబుతుంటే. యివ్వక ఏం చేస్తాను బాబయ్యా. కానీ, ఒక్కమనవిబాబయ్యా. ఇంకొక వెయ్యి రూపాయలు ఎక్కువయివ్వాలిబాబయా. ఐదు వేలరూపాయలు రొఖం, ఆ యిల్లూ".

ఇదివిని,శుక్లజీ కల్లూభుజంపై తట్టి "భలేవాడివిరా! నీకు తెలివిలేదంటే ఎవరు నమ్ముతారురా? సరే, అలాగేయిస్తానులే. అయిదువేలు సరేనా. ఆయిల్లుకూడాసరేనా, యివ్వాళే

బయలుదేరిపోయి, రేపు దస్తావేజు వ్రాయించి రిజిష్టరు చేసుకుందాం.

"అలాగే బాబయ్యా"

శుక్లజీ ఆ మర్నాడు రిజిస్ట్రారు కచ్చేరిలో అయిదు వేలరూపాయలు కల్లూకు యిచ్చి, అతని యింటిని తన పేర వ్రాయించుకున్నాడు.

## 5

కల్లూ ఇంటికివచ్చాక, తన సామానులను అన్నింటినీ కొత్తయింట్లోకి తీసుకుపోయి సర్దుకున్నాడు. సన్యాసితో నాలుగువేల రూపాయలు ఖర్చుపెట్టి ఖార్ఖానా తెరుస్తానన్నాడు. "ఎలా తెరుచుటా ?" అని ఒక వారంరోజులవరకు ఆలోచిస్తు వున్నాడు

కల్లూ ఆరోజు సాయంత్రం హుక్కా త్రాగుతూ వీధి అరుగుమీద కూర్చుని వున్నాడు. ఆసమయాన ఒక యువకుడు శుభ్రమైన దుస్తుల్ని ధరించి కల్లూ సమీపమునకువచ్చి "వందేమాతరం" అన్నాడు. ముతకబట్టలను కట్టుకునివున్నాడు.

కల్లూ హుక్కా త్రాగుటను ఆపి, ఆ యువకునివైపు చూడసాగెను.

యువకుడు "ఏం, గుర్తించలేదూ? అయిదువేల రూపాయలూ రాగానే మరచిపోయావా?"

"గొంతును గుర్తించి కల్లూ "ఎవరు, సాధుబాబాగారా?"

యువకుడునవ్వి, "అవును. ఆనాడు సన్యాసి బాబాను-కాని, ఇవ్వాళ యువక గృహస్థును. ఎప్పుడు ఎలా కావాలంటే అప్పుడు అలా మారాలి" అన్నాడు.

కల్లూ ఆశ్చర్యపడి "రండి బాబా, రండి, కూర్చోండి" అన్నాడు.

యువకుడు కూర్చున్న తరువాత కల్లూ "ఇలా ఎందుకు మారిపోయారు బాబాయ్యా?"

"ఎప్పుడూ నేను యీ వేషంలోనే వుంటాను. గ్రామాలలో స్వదేశీమంత్ర ప్రచారం చేసేందుకు బయలు దేరాను, అందుకని ఆ వేషంతో వచ్చాను."

కల్లూకు యీ మాటలు అర్థం కాలేదు. సంశయిస్తూ ఇవ్వాళ ఎందుకు వచ్చారు బాబయ్యా?"

"శుక్లజీ యిచ్చిన డబ్బుతో ఏం చేస్తున్నావో చూసేందుకు వచ్చాను. ఇప్పటివరకు మగ్గాలు గిగ్గాలు ఏమీ చేర్చ లేదల్లేవుందే? ఇంకా ఆలశ్యం ఎందుకు చేస్తున్నావు? దీపావళి వస్తోన్నది. దేవుడి ఆజ్ఞప్రకారం యీ పండుగకు విదేశీ గుడ్డలు చాలా తక్కువగా కొంటారు, తెలిసిందా? మగ్గాలు పెట్టు. ఇవి స్వదేశీ రోజలు."

"అయితే- మీరు సన్యాసులు కారూ?"

"కాను. నేను సన్యాసిని ఎందుకు కావాలి?"

కల్లూకు ఆశ్చర్యం యింకా ఎక్కువయింది. అతడు భయపడుతూ "మీరు సన్యాసులు కాకపోతే, అయిదు వేల

రూపాయలు ఎలా యిప్పించారు బాబయ్యా? నాయిల్లు వంద రూపాయలైనా చెయ్యదు. అలాటిదానికి అయిదు వేల రూపాయలు యిచ్చాడు. అతడికి యీ బుద్ధి ఎలాపుట్టించారు?" అనెను.

యువకుడు పకపక నవ్వి "నేను పుట్టించిన బుద్ధికాదు. దురాశా పిశాచం అతడి నెత్తిమీద కూచుని అలా చేయించింది."

కల్లా గజ గజ వణుకుతూ "పిశాచమా?"

"భయపడబోకు, రాత్రిళ్ళు చీకటిలో మిణుకు మిణుకుమంటూ వుంటాయే-అ పిశాచాలుకాదు. విను చెబుతాను; ఆ రోజున నీ భార్య బంగారు తావీజు అమ్మింది. గుర్తున్నదా?"

"ఆఁ, గుర్తుంది."

"దానిలోపల ఒక భోజనపత్రవుంది - షరాబు తిరిగి యిచ్చింది. దాన్ని నీభార్యా నాకు చూపింది.గుర్తున్నదా?"

"ఆ."

"నువ్వు ఆరోజున మీ ఆస్తినంతనూ, శుక్లజీ మోసగించి తీసుకున్నాడని చెప్పావు. అలాటప్పుడు శుక్లజీకి తగిన శాస్త్రి జరిగించాలని పించింది. మీరు నిద్రపోయిన తరువాత, ఆభోజ పత్రాన్ని దీపం వెలుగున పరీక్షచేసి చూశాను. దాని మీద చాలాకాలం క్రితం రాసిన శివసంబంధమైన మంత్రాక్షరాలు అస్పష్టంగా కనిపించాయి. అప్పుడు దానివెనక, సిరాతో "నావంశంలో ఎవరికైనా అన్న-వస్త్రాలకు లోటు వస్తే, మన యింటికి వుత్తరదిక్కున త్రవ్వి చూస్తే మొహరీ

లతో నిండివున్న ఏడు కుండలు దొరకుతాయి" అని రాసి, దాన్ని మడచియిచ్చాను. నేను వెళ్ళేటప్పుడు నీభార్యతో చెప్పినసంగతిని వింటూనే వున్నావుగదా!"

ఈ మాటలువిని కల్లూ, ఒక నిమిషమువరకు కొయ్యబొమ్మవలెవుండి-"నాకీపని నచ్చలేదుబాబయ్యా!"

"ఎందుకని"

"బ్రాహ్మల డబ్బు మోసంచేసి తీసుకోటం పాపం బాబయ్యా!"

యువకుడు మళ్ళీనవ్వి "బ్రాహ్మలడబ్బు" ఎక్కణ్ణించి వచ్చింది? లోకంలోవున్న బీదవాళ్ళనందర్నీ మోసంచేసి దాచుకున్నడబ్బు-యీ సంగతి నువ్వూ, నీ భార్యానే చెప్పారుగా. అలాటి డబ్బును యీ విధంగా తీసుకుంటే పాపంరాదు!."

"ఎవరు పాపంచేస్తే వారికి దేవుడే శిక్ష వేస్తాడు బాబయ్యా. శుక్లజీ ఎవరినన్నా అన్యాయంచేస్తే, దేవుడే విచారిస్తాడు. ఆయనకు శిక్ష వేసేందుకు మనంఎవరం బాబయ్యా?"

"వెఱ్ఱివాడా, దేవుడు తన చేత్తో ఏదైనా చేస్తాడా? మనుష్యులచేతనే చేయిస్తాడు. లోకుల్ని పీడించి మోసగించి డబ్బు సంపాదించేవాళ్ళను అన్యాయం చేయటం పాపంకాదు. ఆ డబ్బుతో ఏదైనా మంచిపని చేస్తే పుణ్యంకూడా వస్తుంది, ఇది యీ కాలపు నూతన శాస్త్రం."

"నా కదంతా తెలియదు ఒకరోజున వూళ్ళో కథ చెబుతోంటే వినేందుకు వెళ్ళాను. ఏ హిందువుడైనా పరాయి వాళ్ళ సొమ్మును అన్యాయంగా తీసుకుంటే పాపం వస్తుందనీ, నరకానికి పోతారనీ చెప్పారు."

"నరకమా ? ఇదంతా మూఢనమ్మకము. ఇక నాకు కూర్చొనుటకు తీరికలేదు. ఒకరోజున వచ్చి సావకాశంగా బోధిస్తాను. తొందరగా కార్ఖానా తెరిచే ప్రయత్నం చెయ్యి. ఆలశ్యం చెయ్యవద్దు. ఈ పర్యాయం వచ్చినప్పుడు కార్ఖానా పనిచేస్తూవుండాలి. తెలిసిందా ? లాభం ఏమీ తీసుకో గూడదు. సరిగా గిట్టిన ధరకే అమ్మాలి. గుర్తుందా ? ఇక వెడుతున్నాను'' అని యువకుడు లేచి నుంచొన్నాడు.

కల్లూకూడా లేచి నుంచున్నాడు. అతను వణకుతున్న గొంతుతో "క్షమించండి బాబయ్యా! నాచేతగాదు బాబయ్యా" అన్నాడు.

"ఏమిటీ? లాభంలేకుండా అమ్మవూ? లాభంలేకుండా అమ్మే పద్ధతిమీదనేగా డబ్బు యిప్పించింది.''

"అదికాదు బాబయ్యా, మగ్గాలు పెట్టను; శుక్లజీకి డబ్బు యిచ్చేస్తాను బాబయ్యా !

"ఆఁ ఇచ్చేస్తావా ?"

"అవును బాబయ్యా."

"అంతానా?''

"అంతా బాబయ్యా. ఒక్కదమ్మిడీకూడా వుంచుకోను."

"నీకేం లాభం? నీ పిల్లలు ఎలా బ్రతుకుతారు?"

కల్లూ నవ్వి "నారుపోసినవాడు నీరు పొయ్యడా" బాబయ్యా? అధర్మంగా డబ్బు తీసుకునే బదులు చెట్ల ఆకులు తిని బ్రతకటం మంచిది. పూర్వజన్మలో ఏపాపం చేశానో, యీజన్మలో అనుభవిస్తూన్నాను. ఇక యీజన్మలో బ్రాహ్మల ధనాన్ని అన్యాయంగా తీసుకుంటే, ఏ ఏ కష్టాలు అనుభవించాల్సి వస్తుందో" అన్నాడు విచారం చూపిస్తూ.

యువకుడు కోపమును ఆపుకోనజాలక పళ్లు పటపట కొరుకుతూ "ఇచ్చేస్తావా?"

"ఆ, రేపు ఉదయానే వెళ్ళిపోయి యిచ్చేస్తాను!" మూర్ఖుడా-నరాధమా-దేశద్రోహీ- అంటూ" కాలిబూటుతో కల్లూను ఒక్క తన్నుతన్ని, ఆ అంధకారంలో యువకుడు అదృశ్యుడయ్యాడు.

---

# అనుమానము

సుభద్ర ఏమంత అందమైనదికాదు. చామనఛాయ శరీరం. కాని, ముఖం ఆకర్షణీయంగా వుంటుంది. ఎప్పుడూ కళకళ్ళాడుతూ వుంటుంది. పద్ధెనిమిదోయేడు. ఆమెతండ్రి రావుబహద్దరు గోకులదాసు, సుప్రసిద్ధ ఆర్య సమాజికుడు. ప్రస్తుతం వారు ఆలీపూరు (కలకత్తా)లో సబ్ జడ్జిగా వున్నారు. కాపురం భవానీపురమందలి వకుళబాగాడ్ వీధిలో.

సుభద్ర నాలుగు సంవత్సరాలక్రితం ప్రయివేటుగా పరీక్షకు వెళ్ళి ఎంట్రన్సు ప్యాసయింది. సబ్ జడ్జిగారి ఆప్తమిత్రులు కొందరు సుభద్రను బెథూన్ కాలేజీలో యం. ఏ. వరకు చదివించమని సలహా యిచ్చారు. కాని, వారికి కాలేజీ చదువులపై ఆసక్తి లేదు. కాలేజీ చదువులవల్ల ఆరోగ్యాన్ని చెడగొట్టుకొనుటకు మించి వేరేలాభం ఏదీవుండదని వారి అభిప్రాయం. అందువల్ల, కాలేజీలో చదివించలేదు. లోకులు, డబ్బు ఖర్చైపోతుందని అభిప్రాయంలో కాలేజీలో చదివించుటలేదని నిందించసాగిరి. కాని, సుభద్ర యీ నాల్గు సంవత్సరములలోను ఎన్నో ఆంగ్లగ్రంథములను చదివింది. వాటిలో ఎక్కువభాగం నవలలే.

సుభద్ర జడ్జిగారి ఏకైక పుత్రిక. ఇంట్లో ఆమె "ఆడింది ఆట, పాడింది పాట." ఆమెకు ఒక పెంపుడు కుక్కవుంది. దాని పేరు విమలారాణి, ముద్దుగా "బిమీ" అని పిలుస్తూ వుంటుంది. ఈ కుక్కతో ఎవరో చెలికత్తెతో మాట్లాడుతూ వున్నట్టుల మాట్లాడుతూ వుంటుంది. ఎప్పటి కప్పుడు తన మనస్సులో ఏమనుకుంటే అది, దానితో చెప్పుతూ వుంటుంది. బిమీ మాట్లాడలేకపోయినప్పటికీ, తాను చెప్పేదంతా తెలుసుకో గలదని ఆమె అభిప్రాయం.

ఇంతవరకు అసలు సంగతి చెప్ప మరచాను. క్రొత్తగా బారిష్టరీ ప్యాసై వచ్చిన శ్యామసుందరదాసుకు సుభద్రను యిచ్చి పెళ్ళి చేసేందుకు నిర్ణయం జరిగింది. దాసుగారు బ్యారిష్టరీ ప్యాసైవచ్చి రెండు, మూడేండ్లు అయింది. ప్రాక్టీసు కూడా బాగా నేవుంది. హైకోర్టుకు దగ్గరగా ఛేంబర్సు అద్దెకు తీసికొని వుంటున్నాడు.

మూడవ ఝామువేళ. రెండవ అంతస్థులో చక్కగా అలంకరింపబడిన గదిలో కూర్చుని క్రొత్తగా నేర్చుకున్న పాటను పియానో మీద అభ్యసిస్తున్నది సుభద్ర. ఈ సాయంత్రం ఆమె తల్లి కాబోయే అల్లుణ్ణి విందుకు పిలచింది. తన కాబోయే భర్త వచ్చినప్పుడు యీ పాటను చక్కగా పాడవలెననే అభిలాషతో శ్రద్ధగా నేర్చుకుంటున్నది సుభద్ర. ఆహ్వానింపబడినప్పటికీ, లేక పోయినప్పటికీ కూడ దాసు తరచుగా జడ్జిగారి యింటికి వస్తూనే వుంటాడు. ఇంకొక నెలలోపల ఈ పెండ్లికి లగ్న నిశ్చయముకూడా జరిగింది. పెండ్లి కాగానే

నూతన వధూవరులు కాపురముండుటకై బాలీగంజ్‌లో ఒక బంగళానుకూడా అద్దెకు పుచ్చుకున్నారు.

సుభద్ర పియానో వాయిస్తూ పాడుతోంది. శ్రోతలు—బిమీ ఒక్కతే. బిమీ వెనుక కాళ్ళపై నిలబడి కూర్చుని, చెవులు నిక్కించి నిపుణ సమాలోచకునివలె పాటను వింటూ వున్నది. మధ్యమధ్య ఆనందమును వెల్లడిస్తూవున్నదా యన్నటుల చెవుల నూపుచున్నది. ఇంతలో వీధిగుమ్మమువద్ద ఏదో బండివచ్చి ఆగినటుల చప్పుడయింది.

ఒక నిమిషము తరువాత బంగారు ఫ్రేముగల సులోచనములను ధరించిన ముప్పయి సంవత్సరాల వయస్సుగల ఒక స్త్రీ చేతిలో హ్యాండ్-బ్యాగ్ పుచ్చుకొని యింటిలో ప్రవేశించింది. ఆమెనుచూచి, సుభద్రలేచి నిలబడి చిరునవ్వుతో—'రా, కమలా, చాలారోజులకు దర్శనమిచ్చావు!' అంది.

కమలను చూచి బిమీ మొరుగసాగింది. పాడేపాటకు అంతరాయం కలిగించటంవల్లనే మొరిగిందో, లేకపోతే సుభద్ర అభిప్రాయానుసారముగ మరింకేకారణమువల్లను మొరిగిందో దానికే ఎరుక.

సుభద్ర కుక్కను ఒక్క దెబ్బకొట్టి 'బిమీ, వూరుకో' అంది.

కమల విచారవదనముతో గంభీరంగా 'మీ అమ్మ ఏదీ?' అంది.

'లోపలవుంది, రా' అని సుభద్ర ఆమెను లోపలకు తీసికొని పోబోయింది. కాని, కమల సుభద్రను ఆపువేసి

"నువ్వు రావద్దు. మీ అమ్మతో మాట్లాడవలసి వుంది" అంది.

కమల ప్రవర్తనను చూచేప్పటికే సుభద్రకు అనుమానం కలిగింది. వెంటనే ఆమె "ఏమి ? ఎందుకని ? అంది.

కమల ఏమీ జవాబు చెప్పకుండానే, తెరను తొలగించి సుభద్ర తల్లివద్దకు వెళ్ళింది.

సుభద్ర వ్యాకులంతో పియానో వాయించుకోటం మాని కిటికీలో ఒక మూలగా కూర్చుంది. బిమీకూడా ఎగిరి వెళ్ళి ఆమె ప్రక్కగా కూర్చుంది

సుభద్ర బిమీ తలపట్టుకుని ఊపుతూ-"బిమీ, ఏమిటే నన్నెందుకు రానివ్వలేదు ? ఏమిసంగతి ? నన్నుగురించిన సంగతా ? ఇదే అయితే తోక ఆడించి చెప్పవూ" అంది.

ఇలా ముద్దుగా అడిగేటప్పటికే కూర్చుని వున్న బిమీ పడుకుని, ఆమె చేతివ్రేళ్ళను నాకుతూ, ఆనందమువలన తోక ఆడించసాగింది.

"నీకు అన్నీ తెలుసు, కాదు - ఎప్పటికీకాదు" అంటూ ముద్దుగా బిమీ బుగ్గపై ఒక చిటికవేసింది. కాని విమలారాణి తోక ఆడించుటను మానలేదు.

## 2

లోపల, పడకగదిలో తెరచియున్న కిటికీ దగ్గరగా సుభద్ర తల్లి కుర్చీలో కూర్చునివుంది. దాసీది ఆమె తలను దువ్వుతూవుంది. ప్రక్కనే పాలరాతి రెండు బల్లలువుంది.

దానిమీద ఒక సువాసన తలనూనె సీసా వుంది. లోపలికివచ్చే గుమ్మముకు ఒక తెర వ్రేలాడ గట్టబడివుంది. అందుచే గుమ్మువద్ద నుంచుని "లోపలికి రావచ్చునా?" అని అడిగింది కమల.

గొంతును గుర్తించి సుభద్రతల్లి "ఎవరు కమలా? రా!"

కమల లోపలికివచ్చి సుభద్ర తల్లికి నమస్కారముచేసి ఒక కుర్చీని దగ్గరగా లాగుకొని దానిపై కూర్చున్నది.

"చాలా రోజులయింది వచ్చి! అంతా కులాసానేనా?" అంది సుభద్ర తల్లి.

కమల వేరొక వైపుచూస్తూ విచార పూరితమైన గొంతుతో "దుర్వార్త చెప్పవలసి వచ్చింది."

"ఏమిటీ?"

కమల కొంచెముసేపు ఆలోచించి ఇంగ్లీషులో "ఈ దాసీదానిని అవతలకు పంపించండి" అంది.

యజమానురాలి ఆజ్ఞపై దాసీది అవలకు వెళ్ళింది.

సుభద్ర తల్లి కమలతో "ఏమిటి కమలా? ఏమి జరిగింది?"

"కమలకు సంబంధం కుదిరిందా? శ్యామసుందర దానుతోనేనా?"

"ఆ" ఒక నెలలోపల పెండ్లికూడా అయిపోతుంది. ఏమి?"

"చాలా దుర్వార్త మిసెస్ టండన్! నన్ను క్షమించండి. ఈ వివాహం జరపరాదు."

ఈ మాట వినేప్పటికే మిసెస్ టండన్‌గారి ముఖము వాడిపోయింది. వణుకుచున్న గొంతుతో

"ఎందుకని ?"

కమల తలవంచుకుని మెల్లమెల్లగా "శ్యామసుందరుడు విదేశంలో పెండ్లిచేసుకు వచ్చాడు."

"పెండ్లి చేసుకువచ్చాడా ?"

"అవును"

"ఏమిటి ! నమ్మదగ్గ మాటేనా ? కాదు, నమ్మలేను. శ్యామసుందరుని ఇన్నాళ్ళనుంచీ మేము చాలా మంచివాడనీ ధర్మబుద్ధి గలవాడనీ, అనుకుంటున్నాము. మమ్మల్ని యిలా మోసగిస్తాడా ? నమ్మలేకుండా వున్నాను. ఎవరో శత్రువులు యీ అపనింద వేసి వుంటారు. అయినా, నీకు ఎవరుచెప్పారు?"

"నాకు ఎవరూ చెప్పలేదు. దురదృష్టవశాత్తూ నాకు ఒక ఆధారం దొరికింది."

మరీ ఆశ్చర్యంతో, ఆధారం 'దొరికిందా ?'

కమల తన చేసంచినుంచి ఒక వుత్తరమును తీసి జడ్జిగారి భార్యకు యిచ్చింది.

ఆ కవరుపైన పెద్ద పెద్ద అక్షరాలతో "విలియమ్ వైట్‌వే లిమిటెడ్"అని వ్రాసివుంది. కవరుక్రింది భాగాన ఒకగీత గీసి వుంది. ఈరెంటికీ మధ్య యీక్రింది విధంగా పైపు చేసివుంది.

"మిసెస్ ఎస్. ఎన్. కక్కడ్,

126 ఆడ్‌లెడ్ రోడ్,

హాంప్‌స్టెడ్"

తపాలాబిళ్ళ అంటించుచోట, ఎఱ్ఱరంగుతోవున్న పెన్నీ స్టాంపు ఒకటి అంటించి వుంది.

అదిచూచి వణకుచున్న చేతులతో జడ్జిగారి భార్య కవరు తెరచి, లోపలనున్న లేఖను బయటకు తీసింది. ఆ లేఖ యందలి విషయమునకు సరియైన అనువాదము యీ దిగువ వ్రాయబడినది.

విలియం వెట్ వే లిమిటెడ్
వస్త్రపారిశుధ్యశాఖ.

బెస్ట్ బోర్న్ గ్రోవ్
లండన్.
26 జనవరి 1908.

ప్రియమహాశయా,

పోయిన పర్యాయము పంపిన యిస్త్రీబట్టలలో తొందరలో పొరబాటున ఒక జేబురుమాలును పంపుట మరచితిమి. దానిని యీ వారము పంపబోవు బట్టలతో పంపెదము. క్షమించెదరని నమ్ముచున్నాము.

మీ విశ్వసనీయ,
విలియం వైట్ వే లిమిటెడ్.

మిసెస్ ఎస్. ఎస్. కక్కడ్,
126 ఆడ్ లెడ్ రోడ్,
హ్యాంప్ స్టెడ్.

ఈ లేఖను రెండుమారులు చదివి గోకులదాస్ భార్య "ఎవరీ మిసెస్ కక్కడ్? ఈ లేఖ నీకు ఎలా దొరికింది?" అంది.

"మా అన్నయ్యా శ్యామసుందర్ వుండే ఛేంబర్సు నుంచి నేను చదువుకునేందుకు ఒక నవల తెచ్చాడు. ఆ పుస్తకంలో వుంది యీ వుత్తరం"

ఆ మాటవిని గోకులదాస్ భార్య ఏమీ మాట్లాడలేదు

కమల:—మా అన్నయ్యా నిన్నసాయంత్రం మూడవఝామువేళ యీ పుస్తకం తెచ్చి పెట్టాడు. తీరికలేక నిన్న పుస్తకం తెరవలేదు. ఇవ్వాళ మధ్యాహ్నం పుస్తకం తెరిచేప్పటికే యీ వుత్తరం కనిపించింది. పై చిరునామా చూడగానే ఆశ్చర్యమయింది. విదేశంలో మిసెస్. ఎస్.ఎస్. కక్కడ్ అనే ఆమె వున్నదా? అనిపించింది. మొదట చిరునామాలో పొరపాటున వ్రాశారేమో అనుకున్నాను. కవరు తెరచి చూడగానే సంశయం తొలగిపోయింది. ఏమైనా కానీ, యితరుల వుత్తరములను చదివేందుకు నాకేమి అధికారం వుంది? అని ఆలోచించాను, ఇంతలోకే, నా అంతరాత్మ "నా స్నేహితురాలు సుభద్రకు కాబోయే భర్త గావున, యీసంగతి తెలసికొనుటకు నీకు పూర్తిగా అధికారంవుంది'' అని చెప్పింది. ఆలోచించగా "వాస్తవమే'' అనిపించింది. నిజంగా, శ్యామసుందరుడు పాశ్చాత్య దేశములో వివాహమే చేసుకున్నచో, సుభద్రను పెండ్లి చేసికొనుటకు వీలులేదు. చివరకు, వాగ్దానము చేసి వ్రాసికొన్నప్పటికీ, యీ వివాహం జరిగేందుకు వీలులేదు. ఒక భార్య వుండగా, యింకొక వివాహం చేసికొనుట మన సంఘానికి, మన సభ్యతకూ విరుద్ధము. అందు

వల్ల పుత్తరమును చదివి పూరుకొనుట నా సంఘమునకు, ధర్మమునకు హానిని కలిగించినటులే నని తలచి ఆలోచించి చదివి చూచాను. పోనీ ఒకచోట మాత్రమే "మిసెస్" అని వున్నచో పొరపాటు అనుకొనవచ్చును. లోపలకూడా ఆవిధంగానే వ్రాసి వున్నది."

"నీవు చెప్పేది నిజమే అయితే, ఆమె అసలు పేరు మేరీ అని గాని, నేల్లీ అనిగానీ, జేసీ అనిగాని వ్రాసివుండాలి. మిసెస్ ఎస్. ఎస్. కక్కడ్ అని ఎందుకు వున్నది?"

"ఆంగ్లేయుల ఆచారము ననుసరించి అలా వుండదు. భర్త జీవించియున్న స్త్రీలు భర్తపేరు ముందువచ్చునటుల వ్రాసికొందురు. మిసెస్ నెల్లీ కక్కడ్ అని వ్రాసికొన్నచో, ఆమె విధవ యని భావము."

"ఎందుకని? మనము మిసెస్ శివదేవీ గుప్త, మిసెస్ సరోజినీనాయుడు అని భర్త జీవించి వున్నప్పుడు కూడా వ్రాసికొనుట లేదా?"

"పాశ్చాత్య సాంప్రదాయము ననుసరించి అలా వ్రాయరాదు. మా నాన్నగారు యీ సంగతి చెప్పారు".

కమల తండ్రి పాశ్చాత్య దేశములలో పరీక్షయిచ్చి వచ్చిన డాక్టరు. అందువల్ల ఆయన మాటను ఎవరు కాదనగలరు?

"ప్రపంచంలో ఎవరినీ నమ్మరాదు. మన సంఘంలో ఆడపిల్లలకు తగిన భర్త లభించటం ఎంతకష్టమో నీకు తెలియనిదికాదు. ఇక యీ సంబంధమును వదలుకోవలసిందే!

కూర్చున్న విస్తరి ముందునుంచి లేవగొట్టినట్లయింది. అని'' రావుబహాద్దర్ గోకులదాసు భార్య కంట తడిపెట్టింది. ఇది చూచి కమలలేచి నిలబడి "సరే, నేను వెడుతున్నాను. వుత్తరము యిక్కడ వుంచనా ?" అని అడిగింది.

"వుంచు"

కమల వుత్తరమును టేబులుపై వుంచెను. సుభద్ర తల్లి కమలతో "ఈ సంగతి ఎవరితోనైనా చెప్పావా ?" అని అన్నది.

"లేదు. ఇంతవరకు చెప్పలేదు"

ఆమె కమల రెండు చేతులను పట్టుకుని "అప్పుడే ఎవరితోనూ చెప్పబోకు'' అన్నది.

"సరేలెండి. నా ధర్మాన్ని నేను నెరవేర్చాను. మీకు ఏది న్యాయంగా తోచునో, అలా చెయ్యండి. ఒక్కమాట మాత్రం ముందుగా చెపుతున్నాను. శ్యామసుందరుడు ఎవరినో పెండ్లాడి ఆమెను వదలివేసె నన్నంతమాత్రమున తృప్తిపడి. అతనికి సుభద్రనిచ్చి పెండ్లిచేసినచో నే నూరుకోనను. అందరికీ యీ సంగతి చెప్పితీరెదను. స్నేహము, మోమోటములకు లోబడి ఆర్యసమాజ ఆదర్శములకు అవమానము కలుగనిచ్చుటను సహించను" అని కమల వెళ్ళిపోయింది.

మరికొద్దిసేపటికి సుభద్ర తల్లియున్న గదిలోనికివచ్చింది. వచ్చిచూడగా తల్లి కొయ్యబొమ్మవలె కూర్చొనుట కనిపించింది. ఆమె కనులలో క్రోధము ఏవగింపు, దుఃఖములు ప్రతిబింబించుచుండెను.

సుభద్ర "ఏమిటి అమ్మా?" అని దగ్గర టేబులుపై వున్నకవరునుతీసి, పై విలాసమును చదివి "ఇదేమిటి అమ్మా, చూడనా?" అని అడిగింది.

"చూడు"

సుభద్రలేఖను తెరచి చదివి 'ఏమిటి యిది?'

"శ్యామ సుందరునితో నీకుపెండ్లిచేయుటకు వీలులేదు. అతడు విదేశములలో పెండ్లి చేసుకొన్నాడు."

సుభద్ర రెండవమారు లేఖను చదివింది. పోస్టాఫీసు ముద్ర చూచింది. తరువాత ఆ లేఖను అచ్చటనే పడవైచి తన పడక గదిలోనికి పోయి, తలుపు మూసి గడియ వేసికొన్నది.

## 3

ఒక గంట తరువాత మిస్టర్ రామచంద్ర వచ్చారు. ఈతడు సబ్ జడ్జిగారికి వరుసకు అన్నకొడుకు. ఈయన యీ మధ్యనే ఆర్యసమాజ సభ్యుడయ్యాడు. కలకత్తాలో వ్యాపారము చేస్తూవుంటాడు. ధర్మము, నీతికి సంబంధించిన విషయములలో ఏ మాత్రపు పొరపాటు ఎవరిలోకనిపించినా సహించజాలని వ్యక్తి. విశేషించి విదేశములకు వెళ్ళివచ్చిన యువకులనిన ఇతనికి తగని అసహ్యము.

రామచంద్రుడు వస్తూనే, పినతల్లిగారి పరిస్థితిని కనిపెట్టి "సుభద్ర ఏదీ?" అని మెల్లిగా అడిగాడు.

"నిద్రపోతోంది."

"ఇప్పుడు నిద్రపోతొన్నదా? ఏం? ఒంట్లో బాగా లేదా?"

"లేదు"

"ఇవ్వాళ నువ్వుకూడా యిలా వున్నావేం? కళ్ళు ఎర్రగా కంది వున్నాయి. ఏమి జరిగింది?"

ఇష్టము లేక పోయినప్పటికీ జరిగిన సంగతి యావత్తూ రామచంద్రునకు పినతల్లి చెప్పింది.

రామచంద్రుడు లేఖను చదివి, కుర్చీకి ఆనుకొని, పిన తల్లి వైపు చూస్తూ "ఏదో ఒక విఘ్నము వస్తుందని నేను మొదటినుంచీ శంకిస్తూనే వున్నాను. ఆయన విదేశాలకు వెళ్ళి వచ్చాడని వినగానే వ్యామోహపడ్డారు. విదేశాలకు వెళ్ళి వచ్చినవారంటే మామూలుగా వుంటారనుకున్నావేమో? వాళ్ళు చెయ్యని చెడ్డపని వుండదు. విపరీతమైన త్రాగుబోతు లుగా తయారై వస్తారు. అదేమి పాపమోగాని, మనలో యింగ్లీషు చదువుకున్న ఆడపిల్లలు విదేశాలకు వెళ్ళిరాని వారిని పెండ్లి చేసికొనుటకు యిష్టపడరు. నువ్వే చెప్పు, విదేశ ములకు వెళ్ళిరానంత మాత్రాన వాళ్ళు మనుష్యులు కారా? అసలు సంగతి ఏమిటో తెలుసా? విదేశాలకు వెళ్ళి వచ్చిన పురుషుల్ని పెండ్లాడి, అందరితోనూ "దొరసానిగారు" అని పిలిపించుకొనవలెనని వాళ్ళ సరదా. మనం పిలిచే పాత పిలు పులు వాళ్ళకు గిట్టవు. ఇంతకూ-వాళ్ళను అనవలసిన పని లేదు. కాల మహిమ. పై డాబులు చూస్తున్నారేగాని, లోపలి సంగతి చూచేవారు ఎవరూ లేరు...నీకీ వుత్తరం ఎలా దొరి కింది?"

"శ్యామసుందరుడి ఛేంబర్సునుంచి చదువుకునేందుకు ఒకరు ఒక పుస్తకమును తెచ్చుకున్నారు. ఆ పుస్తకంలో యీ వుత్తరం వుంది. యిది నిజమే నంటావా ?"

రామచంద్రుడు మరొకమారు లేఖను చదివి—"దీనిని బట్టి చూస్తే నిజమే అనాలి."

"విదేశంలో అతడు పెండ్లి చేసికొనినస్త్రీ మరణించిందని అనుకునేందుకు వీలుందా ?"

"పోనీ, ఆ మాటే చెప్పవచ్చును గదా! దానిని దాయవలసిన ఆవశ్యకత ఏముంది ? నాకు యిలా అభిప్రాయం కలుగుతున్నది. "మొదట పెండ్లి చేసికొని వుంటాడు; తరువాత తాను తప్పు చేసితినని తెలసికొని యుండును. క్రొత్త బారిష్టరు. తాత, తండ్రులు ఆర్జించి యిచ్చిన ఆస్తిఏదీ లేదు. దొరసాని గారు చేసే ఖర్చులకే మన సంపాదన సరిపోతుంది. పైగా యిక్కడకు తీసుకునివస్తే కులంలో వెలివేస్తారు. అని ఆలోచించి, అక్కడ వదిలిపెట్టి వచ్చి వుంటాడు. ఆమె బహుశః బీదది అయివుండవచ్చును. అందువల్ల, ఆమె సప్తసముద్రాలు దాటి తన జాడను తెలసికోగలదా ? అని ధైర్యంతో వుండి యుండును. అబ్బ ! ఎంత విచారకరమైనవార్త ! ఎంత విశ్వాసఘాతకుడు ! పాపం, ఆదురదృష్టవంతురాలిగతి ఏమైందో ! ఒకరో, ఇద్దరో పిల్లలుకూడా పుట్టారేమో !"

కొంతసేపటివరకు ఎవరూ మాట్లాడలేదు. ఇంతలోకే నౌకరు టీ తెచ్చి, అచ్చట పెట్టి వెళ్ళిపోయాడు.

ఆ ప్రక్కగా మూసియున్న సుభద్ర పడుకునే గదిగుమ్మము వద్ద 'బిమ్మీ' పడుకునివుంది. టీ త్రాగే సమయమునకు ప్రతి రోజూ బిమ్మీ అచ్చటకు వస్తుంది. ఒకటి రెండు బిస్కత్తులు దానికి ఆసమయంలో దొరుకుతూండేవి. నేడు బిమ్మీ తమ వద్దకు రాకపోవుటనుచూచి, చేత ఒక బిస్కత్తును పుచ్చుకొని రామచంద్రుడు 'బిమ్మీ, బిమ్మీ' అని పిలచాడు.

బిమి అచ్చటనే పడుకుని తోక ఆడించింది. కాని రాలేదు. అది ఇంతకు ముందెన్నడును బిస్కత్తు తినుటకు ఇంత నిర్లక్ష్యమును చూపలేదు.

రామచంద్రుడు టీ త్రాగుతూ – "బాబాయిగారు యింకా రాలేదా?"

"ఇవ్వాళ కొంచెం ఆలస్యంగా వస్తారు. కలకత్తాలో ఏదో సభవుందిట, అక్కడకు వెళ్ళివుంటారు".

రామచంద్రుడు టీ త్రాగిన తరువాత జడ్జిగారి భార్య– "నువ్వు కొంచెంసేపు కూర్చో, నేను సుభద్రను చూసి వస్తాను" అంది.

"వద్దులే, పశ్చాత్తాప పడటమే మంచిది."

"పశ్చాత్తాప పడటం ఎందుకు? అదేమి తప్పుచేసింది? అదేపనిగా ఏడుస్తున్నది. తీసుకు వస్తాను."

రామచంద్రుడు లేచి నుంచుని - "నేను వెళ్ళాలి, వెడుతున్నాను. బాబాయిగారిని రేపు కలుసుకుంటాను."

"కాదు రామూ, కూర్చో, యింకొక పెద్ద చిక్కు వచ్చింది. ఇవ్వాళ శ్యామసుందరుణ్ణి డిన్నరుకు పిలిచాను,

అతడు వస్తూవుండాలి. అతడితో మాట్లాడుటకు నామనస్సు అంగీకరించటం లేదు. మీ బాబాయిగారు వచ్చేటంత వరకైనా కూర్చో; ఏడుగంటల లోపలే వస్తారు".

"వాణ్ణి యింకా యింట్లోకి రానిద్దామనేనా?"

"ఇవ్వాళ అతనిని డిన్నరుకు పిలిచాము; ఈ రోజుకు మాత్రము యిది వరకు వలెనే గౌరవించుట మన ధర్మం. మీ బాబాయిగారిని రానీ, వారు ఎలా నిశ్చయించితే అలా చేద్దాము. చివరకు, మన యింటివైపుకు కూడా రాకుండ చేద్దాము"

"కాని, పిన్నీ! ఒక్కమాట. లోపల యింతబాధ వుంచుకొని పైకి ఏమీ ఎరుగని వాడిలాగ మాట్లాడలేను. మాటల సందర్భంలో నానోటి వెంట ఏచెడుమాటలు వస్తాయో—అని సంశయిస్తున్నాను."

"అతడితో యీప్రసంగం తేవలసిన పనేముంది?— ఈ విషయమే తేవద్దు. మీ బాబాయి వచ్చేటంతవరకు ఏవో సంగతులు మాట్లాడుతూ వుండు; వారు రాగానే వెళ్ళిపోవచ్చును." అని ఆమె సుభద్ర గదివైపుకు వెళ్ళింది.

## 4

శ్యామసుందరుడు సాయంత్రంకాగానే నల్లటి గోరంచు ధోవతి కట్టుకుని, కళ్ళీలలాల్చీ తొడుక్కొని, పైన శిల్కు కండువా వేసికొని సుభద్ర యింటికి వచ్చాడు. డ్రాయింగు రూములోనికి పోగానే, ఏదో పుస్తకము చదువుతూ రామచంద్రుడు కనిపించాడు.

"మిస్టర్ రామచంద్ర, నమస్తే!" అని చిరునవ్వుతో శ్యామసుందరుడు నమస్కారము చేసాడు.

రామచంద్రుడు లేచినిలబడి "రండి కూర్చోనండి!" అని తిరిగి కుర్చీలో కూర్చొని పుస్తకమును చదువుకోసాగాడు.

శ్యామసుందరుడికి యితడి స్వభావం మొదటినుంచీ తెలుసును. అందుకని "అదేపనిగా చదవకండి, కళ్ళకు జబ్బు చేస్తుంది." అని ఛలోక్తిగా అన్నాడు.

అభ్యాగతుని వద్ద కూర్చుని, పుస్తకమును చదువుతూ వుండుట సభ్యతావిరుద్ధమని రామచంద్రుడు భావించెను. దానితో పాటు పిన్నిగారు చెప్పిన మాటలుకూడా గుర్తుకు వచ్చాయి. అందుచే కృత్రిమ మందహాసంతో "పార్కరు వ్రాసిన పుస్తకము చాలాబాగుంది. మీరు చదివారా?" అని అడిగాడు.

రామచంద్రుని వేళాకోళము చేయవలెననే వుద్దేశ్యంతో ఏమీ ఎరుగని వానివలె "చదువక పోవుటేమి; గిల్బర్ట్ పార్కరు వ్రాసిన నవలలన్నీ చదివాను. దీనిపేరేమిటి?" అన్నాడు శ్యామసుందరుడు.

రామచంద్రుడు లోలోపల క్రుళ్ళుతూ "నవలా! కాదు థియోడర్ పార్కరు వ్రాసిన 'సెర్మన్సు' అనే ధర్మ గ్రంథం."

'అదా!—నేను చదవలేదు.'

రామచంద్రుడు మరల పుస్తకమును చదువ సాగెను. ఒకగడియసేపైన పిమ్మట తనను సంబాళించుకుని "పాశ్చాత్య దేశాల్లో వున్నప్పుడు ధార్మిక జీవితమును గురించి ఏమైనా

యోచించితిరా? బహుశః బ్యారిష్టరీ చదువుటకే కాలమం తయు వినియోగ పడిందను కుంటాను!"

"కాదు. ఎప్పుడూ చదువుతూనే వుండేవాడినికాను. అప్పుడప్పుడు చర్చికికూడా వెళుతూ వుండేవాడను. కాని స్త్రీలకు రక్షకుడు (Escort) గా వెళుతూ వుండెడివాడను"

రామచంద్రుడు తనలోతాను 'అలాగా రక్షకునిగానా భక్షకునిగానా' అనుకొని (బయటకు) "లండన్‌లో సవాలో స్ట్రీట్‌లో థీస్టిక్ చర్చివుంది. దానికి ఎప్పుడైనా వెళ్ళారా? అప్పుడప్పుడు స్టవ్‌ఫోర్టు బ్రూక్‌దొర వచ్చి అక్కడ వుపదేశిస్తూ వుంటాడని విన్నాను. మా ఆర్యసమాజమంటేనూ, బ్రహ్మసమాజమంటేనూ వారు ఎంతోగౌరవంగా భావిస్తారట"

శ్యామసుందరుడు కనుబొమలుముడుచుకుని ఏదో ఆలోచించుచున్నటుల "ఎక్కడ? సవాలో స్ట్రీటా? ఆఁ, గుర్తు వచ్చింది. పికడిల్లీలో ఒక స్ట్రీటువుంది. ప్యాలెస్‌కు వెళ్ళి వచ్చేటప్పుడు చూచాను, కాని లోపలికి వెళ్ళలేదు"

రామచంద్రుడు ఆశ్చర్యముతో "ప్యాలెసుకు వెళ్ళి వచ్చేటప్పుడా?"

"అవును. ప్యాలెసు అంటే రాజభవనం అనుకుంటారేమో! కాదు. ప్యాలెసు అంటే ఒకథియేటరు. డబ్బు పుచ్చుకుని నాటకములు మొదలైన వాటిని చూడనిస్తారు. ఒకసారి ఒక తమాషాజరిగింది. ఒకరోజు సాయంత్రం లార్డుబిషప్ భార్య స్టేషనులో రైలుదిగి బండీవాడితో "ప్యాలెసుకు తీసుకుపొమ్మందిట. ఆమె రాజభవనము బకింగ్‌హాం ప్యాలెసుకు పోవలసి

వుండెను. కాని, బండివాడు తిన్నగా మ్యూజిక్ హాలుకు తీసుకు వచ్చిదింపాడు.

"ఏం, అలా ఎందుకు జరిగింది ?"

శ్యామసుందరుడు వెకిలిగానవ్వి "ప్యాలెస్ అంటే మ్యూజిక్ హాల్ అనేఅర్థంరాదనేగా మీ అభిప్రాయం!" అని మరీ పకపక నవ్వేడు.

రామచంద్రునకు అతని వికటహాసమును చూచేప్పటికే విపరీతంగా క్రోపంవచ్చింది. మన దేశపు యువకులు విదేశాలకు పోయి వున్నజ్ఞానాన్నికూడా క్రోల్పోతారని అతడు భావించే వాడు! మూర్ఖులైవచ్చి పైగా మేము విదేశాలకు పోయి విజ్ఞానాన్ని ఆర్జించుకువచ్చామని గర్వంగా చెప్పుకుంటారు. యిదంతా వట్టిభ్రమ — ఇంతవరకు బాబాయిగారు రాలేదు. ఇంకా ఎంతసేపటివరకు యీ పీడ వదిలించుకునేందుకు వీలు కాదో!

ఇంటివారు ఎవరూ యింత వరకు తనను మర్యాద చేయుటకు రాకపోవటంచే శ్యామసుందరునకు అనుమానము కలుగసాగింది. ఇదివరకు వచ్చినప్పుడల్లా సుభద్రతో ఏకాంతంగా మా్లాడుటకు వీలుంటూవుండేది. సుభద్రతో కొంత సేపుమాట్లాడిన తరువాత ఆమెతల్లి వస్తూవుండేది. 'ఇదేమిటా పీడు మనకు దాపురించాడు' అని రామచంద్రాన్ని చూచి శ్యామసుందరుడు అనుకోసాగాడు. తెరచాటున ఏ మాత్రపు శబ్దమైనా అయితే, సుభద్ర వస్తోందేమోనని ఎదురుచూచే వాడు.

రామచంద్రుడు కొంతసేపటివరకు వూరుకుని "లండన్‌లో మీరు ఎక్కడవుంటూ వుండేవారు ?" అని అడిగాడు.

"ఆడ్ లెడ్ రోడ్, హ్యాంప్‌స్టెడ్‌లో"

"ఇల్లు అద్దెకు పుచ్చుకున్నారా ?"

"లేదు. అంత డబ్బెక్కడిది ?"

"అయితే, హోటలులో వుండేవారా ?"

"హోటలులో కూడా కాదు. అక్కడకూడా చాలా డబ్బు ఖర్చవుతుంది. గదులు తీసుకున్నాను."

"మెస్సులో అలాటి అవకాశం వుంటుందనుకుంటాను. అక్కడ మొగవాళ్ళేనా, ఆడవాళ్ళుకూడా వుంటారా ?"

"మొగవాళ్ళు, ఆడవాళ్ళుకూడా వుంటారు. చాలా మంది బీద విద్యార్థులు యిళ్ళు అద్దెకు తీసికొనే శక్తి లేక గదులు తీసుకుంటారు. ఒక పడకగది, ఒక చదువుకునే గదితో పని జరిగిపోతుంది."

"మీరు ఎన్నిగదులు తీసుకున్నారు ?"

"రెండు."

"రామచంద్రుడు లోలోపల, ఊఁ, ఒంటరి వాడికి రెండుగదులెందుకు ? పడక గదిలో కూర్చుని చదువుకో గూడదా, అనుకుని, బయటకు" మీరు ఎప్పుడూ హ్యాంప్‌స్టెడ్ లోనే వుంటూవుండేవారా ?"

లేదు. మొదటి సంవత్సరము ప్రిన్స్‌సెస్క్వేర్‌లో గదులు తీసుకుని వుండేవాడను. ఎండాకాలపు శెలవులలో ప్యారిస్ చూచి వచ్చేందుకు వెళ్ళాను, ఆ ప్రయాణంలో చాలాడబ్బు

ఖర్చయింది. అందుకని హ్యాంప్ స్టెడ్‌లో వుండసాగితిని. పట్టణము చివరగావుండుటవల్ల యిక్కడఖర్చుతక్కువగాఅవుతుంది.

రామచంద్రుడు లోలోపల "ఊఁ ప్రిన్సెస్ స్క్వేర్‌లో వున్నప్పుడే పెండ్లి అయివుంటుంది. ప్యారిస్ "హనీ మూన్" కోసం వెళ్ళి వుంటారు. తిరిగివచ్చాక, ఖర్చుతగ్గించుకో వలసి వచ్చింది—అనుకుని, బయటకు థియేటరుకు తరచుగా వెడుతూవుండేవారా?"

"మొదటి సంవత్సరంలో ఎక్కువగా వెడుతూ వుండేవాడిని హ్యాంప్‌స్టెడ్ వెళ్ళాక ఎక్కువగా వెళ్ళేవాడినికాను. హ్యాంప్‌స్టెడ్‌కూ థియేటర్‌హాలుకూ చాలాదూరం వుంది. అయినప్పటికీ, ఏదైనామంచి నాటకం వచ్చినప్పుడల్లా వెడుతూ వుండేవాడిని."

రామచంద్రుడు మనస్సులో, "అవును! దూరం వుండటంవల్లనే కాదు! మొదట్లో ఒక టిక్కెట్టు సరిపోయేది. తరువాత రెండు కొనవలసివచ్చింది. ఏ హిందుస్థానీ పిల్లో అయితే, మొగుడు నాటకాలు చూసి వచ్చేందుకు వెళ్ళినప్పటికీ, వంటయింట్లో కుందేలువలె కూచునేది, ఆవిడ దొరసాని గారాయె! మరి!"

శ్యామసుందరుడు వూరుకోనలేక "ఇంట్లోవారు ఎవరూ కనిపించరేం?" అన్నాడు.

"బాబాయిగారు కచ్చేరీనుంచి కలకత్తాకు వెళ్ళారట. అక్కడ ఏదో సభ వున్నదట సుభద్ర నిద్రపోతోన్నది. పిన్నిగారుకూడా అక్కడే వుండి వుంటారు."

"సుభద్ర నిద్రపోతున్నదా ? ఎందుకని ? ఆరోగ్యం సరిగా లేదా ?"

"కాదు"

"అయితే, ఏదీకానివేళ యిప్పుడు నిద్రపోవుటం యేమిటి !"

"ఏమో నాకు తెలియదు" అని రామచంద్రుడు మెదల కుండ వూరుకున్నాడు.

శ్యామసుందరునికి ఏమీ బోధపడలేదు. సుభద్ర నిద్ర పోతున్నది. అనారోగ్యంవల్ల కాదుట. ఎందువల్లనో రామ చంద్రుడు చెప్పుటలేదు. ఇన్నాళ్ళనుంచీ వస్తుంటే, యీవిధంగా ఎప్పుడూ జరుగలేదు.

ఇదే సమయమునకు వీధి గుమ్మమువద్ద బండివచ్చి ఆగిన శబ్దం వినిపించింది.

"బాబాయిగారు వచ్చినట్టున్నారు." అన్నాడు రామ చంద్రుడు.

కచేరీ దుస్తులతోనే సబుజడ్జిగారు వచ్చారు. శ్యామ సుందరుని చూడగానే, శ్యామసుందర్ ! ఎప్పుడు వచ్చావు ? రామచంద్రం కూడా వచ్చాడూ ? కూర్చోండి, కూర్చోండి అని పలుకరించి జడ్జిగారు శ్యామసుందరునికి దగ్గరగా కూర్చుని సభావృత్తాంతము నంతను, చెప్పసాగెను. రామచంద్రుడు "బ్రతుకు జీవుడా" అనుకొని లోపలికి లేచిపోయాడు.

# 5

సుభద్ర పడక గదిని ఆనుకుని ఒక చిన్నగది వున్నది. తరుచు ఆ గదిలోనే ఆమె కూర్చొనుటా, చదువుకొనుటా జరుపును. ఈ గదిలోనే రావుబహద్దర్ గారి భార్య ఒకసోఫాలో కూర్చుని వున్నది. సుభద్ర ఆమె ఒడిలో తలపెట్టుకుని పడుకుని వున్నది. తల్లి ఆమెను ప్రేమతో ఓదారుస్తోంది. బిమా గచ్చు మీద పరచిన తివాచీపై కూర్చుని విచారముతో సుభద్రవైపు రెప్ప వాల్చకుండా ఓరకంట చూస్తోంది.

సుభద్రతో తల్లి, "మీనాన్నను రానియ్యి. ఆలోచిద్దాము. హడావిడి పడితే ప్రయోజనం ఏముంది? ఇంకా నయం. ముందుగా తెలిసింది. ముంచుకుపోయిందేమీ లేదు." అంటూ కూతురును పరిపరి విధాలుగా ఓదారుస్తూ వుంది. కాని సుభద్ర ఏడుపును మానలేదు. పైటచెంగుతో తన కన్నీరు, తుడుచుకొని, కూతురు కళ్ళుకూడా తుడుస్తోంది. ఇంతలోనే రామచంద్రుడు గుమ్మము వద్దకు వచ్చి "పిన్నీ! లోపలకు రావచ్చునా?" అన్నాడు.

సుభద్ర లేచి మెల్లగా తన పడకగదిలోనికి పోయి తెర వేసికొనెను. రామచంద్రుడు లోపలకు వెళ్ళి పినతల్లిని "సుభద్ర పరిస్థితి ఎలా వుంది?" అని ప్రశ్నించాడు.

"రేపు వుదయం బండికి ముంగేరో, అలహాబాదో, వెడతానంటోంది."

"ముంగేరుకంటె అలహాబాదు మేనత్తదగ్గరకు పంపితేనే బాగుంటుంది. ఏదోవిధంగా మనస్సు కుదుటబడుతుంది"

ఇంతలో సబ్ జడ్జిగారు లోపలకు వచ్చి "శ్యామసుందరుడుతో డ్రాయింగ్ రూములో కూర్చుంటే—నువ్విక్కడ వున్నావా? సుభద్ర ఏదీ?" అనెను.

భార్య జరిగిన సంగతినంతను ఆయనతో చెప్పి, లేఖను నిచ్చెను.

విషయమునంతను తెలుసుకొని గోకులదాసు గారు హతాశుడై కుర్చీలో కూలబడి రెండుచేతులతోను తలను పట్టుకొని ఆలోచింపసాగెను.

కొంతసేపైన తరువాత "రామచంద్రం - శ్యామసుందరుణ్ణి యీసంగతి అడిగారా?" అని జడ్జిగారు అడిగారు.

"లేదు. సరిగా అడుగలేదు. ఏదో మాటల సందర్భంలో చెప్పిన విషయమునుబట్టి ఆలోచిస్తే, నిజమేనని తోచింది" అని తనకు అనుమానమును కలిగించిన మాటలను చెప్పెను.

గోకులదాసు లేచి నుంచుని - "అలాకాదు, అడిగితీరవలసిందే. ఇలా అనుమానపడవలసిన పనేముంది? నేనే వెళ్ళి అడిగి వస్తాను. ఉత్తరం యిలాయియ్యి" అని బయటకు శ్యామసుందరునివద్దకు వెళ్ళాడు.

సుభద్ర గదిలోవుండి విషయములన్నిటిని గమనించుచుండెను. తండ్రి వెళ్ళుచుండుటను తెలసికొని, అతనిరాకకై నిరీక్షింపసాగెను.

అయిదునిముసములలోపలనే గోకులదాసు తిరిగివచ్చి-శ్యామసుందరుణ్ణి యీసంగతి అడిగేప్పటికే ఆశ్చర్యపడ్డాడు!

"అంతా అబద్ధమే అన్నాడు. పైగా ఎవరు చెప్పారో అని అడిగాడు. అనగానే ఆ ఉత్తరం యిచ్చాను. అదిచదివి ఒకటే నవ్వసాగించాడు. "ఈ ఉత్తరం చూసేనా యింత గందరగోళం చేస్తున్నారు? విదేశాలలో యింట్లోవుండే ఆడవాళ్ళే సాధారణంగా చాకలి పద్దు, పాలపద్దులు చూసుకుంటూ వుంటారు. కూరలు వగైరాలుకూడా వారే కొంటూవుంటారు. అవసరమైతే ఉత్తర ప్రత్యుత్తరములనుకూడా వారే జరుపుతు వుంటారు. పురుషులు యీ విషయములను చూడరు. అందువల్ల, రుమాలురాలేదని నేను వ్రాసినప్పుడు, యింటి యజమాను రాలే యీవుత్తరము వ్రాసినదని ఆమె తలచియుండును. ఆ అభిప్రాయంతోనే, మిసెస్ యస్. యస్. కక్కడ్ అని ఆమె వ్రాసింది" అని అన్నాడు.

దాస్ సతి- మీరు నమ్మారా?"

గోకుల్ దాస్- "ఎందుకు నమ్మను? ఇందులో నమ్మకు వీలులేని విషయం ఏదీ లేదే? ఈ మధ్యనే ఒక విచిత్రం జరిగిందట. ఇతని మిత్రుడొకడు క్రొత్తగా బ్యారిష్టరు ప్యాసై వచ్చాడట, అతడు ఆడవాళ్ళ అలంకార వస్తువుల క్యాటలాగు పంపమని ఒక విదేశీ కంపెనీకి వ్రాశాడట. ఆ కంపెనీవారు క్యాటలాగు పంపుతూ మిస్ జే సీ. ఘోష్ అనే విలాసం వ్రాశారట. అప్పటినుంచి, అతని స్నేహితులందరూ "మిస్ జే. సీ. ఘోష్" అని అతనిని ఎగతాళి చేస్తున్నారట.

ఇలా చెప్పుకుంటూ వున్న సమయంలో శ్యామసుంద

రుడు గుమ్మమువద్దకు వచ్చి "లోపలకు రావచ్చునా?" అనెను.

గోకులదాసు వెళ్ళి అతనిని లోపలకు తీసికొనివచ్చాడు. శ్యామసుందరుడు ఒక కుర్చీలో కూర్చుని జడ్జిగారి సతితో "నేను చెప్పినది నమ్మజాలకపోతే, యింకొక దృష్టాంతము కూడా చూపించుతాను!

"ఏ దృష్టాంతము?"

"నేను నిజంగా పెండ్లి చేసికొనేవుంటే, యీ వుత్తరము ముందూ, తరువాతా వేసే వుతుకు బట్టలలో ఆడవాళ్ళ బట్టలుకూడా' వుండవలెనుగదా?"

"అవును"

"విదేశాలలో చాకలిని కుదుర్చుకోగానే ఒక రిజిష్టరు యిస్తారు. ప్రతిసోమవారము వుతుకుకు బట్టలు వేయునప్పుడు ఆ రిజిష్టరులో ఒకవైపున బట్టలపద్దు వుంటుంది. చాకలివాడు విడచినగుడ్డలు తీసికొనిపోవునప్పుడు వాటితోపాటు గతవారము వుతికిన బట్టలకూలీకూడా తీసికొనిపోవును. మళ్ళా శుక్రవారం సాయంత్రము వుతికినబట్టలు తెచ్చునప్పుడు ఆ రిజిష్టరు తీసికొనివచ్చి, అందులో దేనికి ఎంతడబ్బు యివ్వాలో వ్రాసుకొంటాడు. చొక్కాకు నాల్గు పెన్నీలు, కాలరుకు ఒక పెన్నీ, రుమాలుకు అరపెనీ-యీ విధంగా వుండును. నాచే బర్సులో పాతకాగితాలలో యిలాటి ఒకచాకలిపద్దు పుస్తకంకూడవుంది. ఇవ్వాళ వుదయానే, కాగితాలు సర్దునప్పుడు ఆ రిజిష్టరు దొరి

కింది. ఆ పుస్తకముతెచ్చి చూపిస్తాను. దానిలో స్త్రీల బట్టలుపద్దు వ్రాసిలేనిచో, మీరు నమ్మెదరా ?''

సుభద్రతల్లి యీ మాటలువిని భర్తముఖము కేసి చూచింది.

గోకు—శ్యామసుందర్, నీవు చెప్పునది నిజమే ఎవరు నమ్మినను నమ్మకున్నను నాకు నమ్మకంవుంది. నిన్ను అనవుసరముగా శంకించినందుకు మేము చాలా సిగ్గు పడుచున్నాము. అయినప్పటికీ, ఆ రిజిష్టరు తెచ్చి, ఎవరికైనా సందేహం వుంటే నివృత్తి చేయుట మంచిది.

గోకులదాసుభార్య—నాకు సందేహంలేదు. రిజిష్టరు తెచ్చి నాకు చూపెంచనక్కరలేదు. కాని, అవుసరమైతే సుభద్రకు తెచ్చి చూపించు.

''సరే'' అని శ్యామసుందరుడు వెళ్ళెను.

అరగంట అయినతరువాత శ్యామసుందరుడు మరలి వచ్చెను. రిజిష్టరును చేతపుచ్చుకొని ఒక్కొక్క అంగను రెండేసి–మూడేసి మెట్లను దాటుచూ పైకి వచ్చాడు. వచ్చి చూడగా డ్రాయింగ్ రూములో ఎవరూకనిపించలేదు. బయిటి వసారాలో ఎవరో ఉన్నటుల తోచెను. బయటకుపోగా అతనికి తెలనూనె సువాసన, శిల్కుబట్టలు గలగలశబ్దము వినిపించింది.

అతడు ఇంకనూ దగ్గరకుపోయి, ''సుభద్రా!'' అని పిలచెను.

కోమల స్వరముతో "ఎందుకు" అని జవాబువచ్చింది.

రిజిష్టరు తెచ్చాను చూస్తావా ?

సుభద్రవచ్చి రిజిష్టరును తీసికొని విసరి నేలమీద కొట్టెను.

శ్యామసుందరుడుఅభిమానముతోను, కలవరముతోను-"రిజిషరు చూడదలచుకోలేదా? సందేహం తీర్చుకోనక్కర లేదూ? ఇదేనా నీ అభిప్రాయము?"

సుభద్ర బిమీని ఒడినుండి దించి, లేచివచ్చి శ్యామసుందరుని వక్షస్థలానికి తన తలనానించి అతని కలవరపాటును మాన్పి సంతోష పెట్టింది.



# రసమయి

లాలా రఘువరదయాళు వివాహం అయి పద్దెనిమిది సంవత్సరాలు అయింది ఈ పద్దెనిమి సంవత్సరాలు భార్యతో పోట్లాడుతూ వుండటం, మళ్ళా ఆమెను బ్రతిమాలు కోటంతోనే గడచిపోయాయి. ఇలాంటి గయ్యాళిభార్య సాధారణంగా ఎక్కడోగాని వుండదు.

దయాళుకు యిప్పుడు నలభై సంవత్సరాల వయస్సుంటుంది. అతడిభార్య రసమయికి వయస్సు ముప్పైఏండ్లు వుంటాయి. రసమయి అనే పేరు ఎవరు పెట్టారోగాని, ఒక్క నమస్కారం చెయ్యొచ్చు! రసాలు అనేకం వున్నాయి- కాని ఇక్కడ వున్నవి రౌద్ర భయానక రసాలు మాత్రమే.

దయాళు ఉరుదూ చదువుకున్న ప్లీడరు. ప్రయాగలో బాగా ఆర్జిస్తూ, గౌరవంగా జీవిస్తూన్నాడు. ప్రయాగలో ఆయనకు స్వంత యిల్లులేదు. ఆజిల్లాలోనే ఒక కుగ్రామంలో వుంది. అయినప్పటికీ చాలా కాలంనుంచి ప్రయాగలోనే వుంటున్నాడు.

ఇప్పటివరకు దయాళుకు సంతానం కలుగలేదు. భార్యా పరిస్థితి చూస్తే, యికముందు కూడా సంతానం కలిగే ఆశలేదు

చాలా రోజులనుంచీ దయాళు పినతల్లి, మేనత్త ఇద్దరూకూడా రెండవ వివాహం చేసుకోమని దయాళును బలవంతపెడు తున్నారు, ఆతడికికూడా రెండవపెండ్లి చేసుకుందామనే వుంది కాని, రసమయికి ఝుడిసి ఆ ప్రయత్నం చెయ్యలేక పోయాడు.

ఈ మధ్యనే ఏదో సామాన్యపు పోట్లాటవల్ల ఆతడు రెండురోజుల వరకు యింటికే రాలేదు. చివరకు కోపంవచ్చి రసమయి పుట్టింటికి వెళ్ళింది. ఆవిడ వెళ్ళిపోయాక, ధైర్యం తెచ్చుకుని దయాళు యింటికివచ్చి ఇక దాని మొగం చూడ ననీ – రెండవపెళ్ళి చేసుకుంటాననీ - ఈ యింటదానిని అడుగుపెట్టనివ్వననీ దానితో తెగతెంపులు చేసుకున్నాననీ - ప్రతిజ్ఞ చేసుకున్నాడు.

## 2

ఝూసీ ప్రయాగకు అవతల గంగ ఒడ్డున వుంది. ఈ రెండు గ్రామాలకూ మధ్య గంగా-యమునా సంగమం వుంది. ఝూసీ రసమయి పుట్టిల్లు వున్నవూరు ఆమె తల్లిదండ్రులు మరణించి చాలాకాలం అయింది. ఇప్పుడు ఆ యింట్లో రసమయి, విధవ అప్పగారు దులారా, ఇద్దరు తమ్ముళ్ళూ వుంటు న్నారు. రసమయి అన్న జగన్నాద్ ప్రయాగ స్టేషనులో వుద్యోగం చేస్తున్నాడు. తమ్ముడు మనోహరీకూడా చదువు మాని యింటివద్దనే వుంటున్నాడు. ఇంతవరకు అతనికి ఏవుద్యోగమూ దొరకలేదు.

రసమయి ఝూసీకి వెళ్ళి ఒక నెల దాటింది. ఇంతకు ముందు ఏ రెండు-మూడురోజులలో–లేకపోతే ఒకవారంలో రోజు

లవగా నేభర్తవచ్చి బ్రతిమాలుకుని తీసుకుపోతూ వుండేవాడు. ఈ పర్యాయం అలారాకపోయేటప్పటికే రసమయికి కొంచెం కలిగింది.

అవ్వూళ్ళోనుంచి ఒక పిల్లవాడు గంగానది వంతెనను దాటి దారాగంజ్ స్కూల్లో చదువుకునేందుకు ప్రతిరోజూ వెడుతూ వుంటాడు. ఆ పిల్లవాడువచ్చి "రఘువర దయాళు రెండవ వివాహం చేసుకొంటున్నాడనీ, లగ్న నిశ్చయంకూడా జరిగిందనీ" వదంతి వేశాడు.

ఈ సంగతి విని రసమయి అప్పదులారా ఒకరోజు సాయంత్రం ఆ కుర్రవాడిని తన యింటికి పిలుచుకు వచ్చింది. ఆ కుర్రవాడికి తినేందుకు కొంచెం మిఠాయి పెట్టి "తమ్ముడూ, మా దయాళు మళ్ళీ పెళ్ళి చేసుకొంటున్నాడట. నిజమేనా?" అని అడిగింది.

"నిజం కాక పోవటమేమిటి. మాక్లాసులో చందీ అనే కుర్రవాడు చదువుకుంటున్నాడు. అతడి మేనమామ కట్రాలో వుంటున్నాడు. అతడి కూతుర్ని యిచ్చేందుకు స్థిరపరుచుకున్నారు."

"నీకు సరిగా తెలుసునా?"

"తెలియక పోవటమేమిటి" చందీయే నాతో చెప్పాడు లగ్నంకూడా పెట్టుకున్నారట."

వాళ మామయ్య పేరేమిటి!"

"సరయూ ప్రసాదు. జడ్జిగారి కచేరీలో పనిచేస్తున్నారు"

"ఆయన యిల్లెక్కడో తెలుసునా?"

"ఎందుకు తెలియదూ" చంద్రీ, నేనూ కలిసి చాలా దఫాలు వెళ్ళాము."

"పిల్లకు ఎన్నేళ్ళుంటాయి?"

" నాయీడు వుంటుంది"

పిల్లవాడికి షుమారు పదమూడు సంవత్సరాల వయస్సుంటుంది.

"పిల్ల ఎలావుంటుంది?"

"చాలా అందంగా వుంటుంది."

దులారా కొంచెంసేపు ఆలోచించి "రేపు మమ్మల్ని యిద్దర్నీ అక్కడకు తీసుకు వెడతావా?"

"ఎందుకు?"

"వాళ్ళను ఏదోవిధంగా బతిమాలుకొని, యీ పెళ్ళి చేస్తే, నాచెల్లెలుకూ, మీ కూతురుకూ కూడా సుఖం వుండదని చెపుదామని వుంది. తీసుకు వెడతావుగా!"

"ఎన్ని గంటలకు?"

"ఈ వేళకే. భోజనం చేసుకు వెడదాము!"

"నేను స్కూలుకు వెళ్ళవద్దూ?"

"ఒక్కరోజేగా! మేష్టరుగారిని శెలవు అడిగిరా. నీకు రూపాయి బహుమతీ యిస్తాను. గాలిపడగ దారం కొనుక్కో.

పిల్లవాడికి ఆశ కలిగించేప్పటికే వెంటనే వొప్పుకున్నాడు.

# 3

మరల్రివాడు మర్నాడు అప్పా చెల్లెళ్ళను యిద్దర్నీ వెంట బెట్టుకొని ప్రయాగకు తీసుకు వెళ్ళాడు. గంగ వంతెనదాటి ఒక బండీమీద కట్రాలో సరయూప్రసాదు యింటికి వెళ్ళారు. గుమ్మంముందుకు వెళ్ళగానే బండి ఆగింది.

రసమయి—ఈ యిల్లేనా?

అవును!

"సరే, నువ్వు బండీలో కూర్చునివుండు. మేము లోపలికి వెళ్ళి వాస్తాము!" అని అప్పా-చెల్లెళ్ళు యిద్దరూ యింట్లోకి వెళ్ళారు.

ఆ సమయంలో, ఆ యింట్లో స్త్రీలు కొందరు స్నానం చేస్తున్నారు. మరికొందరు భోజనం చేసేందుకు కూర్చున్నారు. కొందరు భోజనం చేసి అరుగుమీద కూర్చుని తల ఆరబెట్టుకుంటున్నారు. ఆకస్మికంగా యిద్దరు గొంవకుటుంబానికి చెందిన స్త్రీలు యింట్లోకి రాగానే. వారిలో ఒకతె "ఎవరుమీరు" అంది.

దులారా ఝూసీనుంచి మిమ్మల్ని కలుసుకునేందుకు వచ్చాము.

స్త్రీ సందేహంగా-రండి-కూర్చోండి.

ఇద్దరూ అరుగుమీద కూర్చున్నారు. దులారా-యింటివారు ఏరండీ?

ఒకస్త్రీని చూపించి—వీరే.

యజమానురాలు-ఏంపనిమీద వచ్చారు?

"మీా అమ్మాయి వివాహ మా?"

"అవును, మా చిన్నమ్మాయి వివాహం"

"ఎప్పుడు ?"

"ఈ నవమికిగాక పై నవమికి"

"పెళ్ళికొడుకు ఎవరు?"

"రఘువర దయాళు- ప్లీడరీ చేస్తున్నారు !

"భార్యవుండగానే మళ్ళీ యిస్తున్నారా !"

యజమానురాలికి ఆశ్చర్యంవేసి "మీారు వారిని ఎరుగుదురా? అంది.

"ఎందుకు ఎరుగను, బాగా ఎరుగుదును. మావూరు పిల్లనే యిచ్చారు.

"అవును, సవతి వున్నమాటనిజమే ఆవిడ్నివదలి పెట్టేశారట."

రసమయి యిప్పటివరకు ఏమీా మాట్లాడకుండా వూరుకుంది. ఆవిడకు రాను రాను క్రోపం పెరిగిపోతూవుంది యజమానురాలు చెప్పిన యీామాట వినగానే, ఆమె కాళ్ళు చేతులు గజగజ వణకిపోయాయి. కళ్ళు నిప్పుల్లాగ భగభగలాడ సాగాయి.

దులారా- భార్యను ఎందుకు వదిలేశాడో కనుక్కున్నారా?

"ఆపిల్ల గయ్యాళిగంపట,

ఈ మాటవినగానే రసమయి ప్రొంచియున్న పులివలె లేచినుంచుంది. సావడి మూాలలో ఒక చీపురుకట్ట ఆనించివుంది.

రెప్పపాటులో ఆ చీపురును తీసుకువచ్చి యజమానురాలిని అదే పనిగా కొట్ట సాగింది. ఒకప్రక్కన చీపురు కట్టతో కొడుతూ'' ఏమిటే?- ఆఁ - చావరాదూ - నా మొగుడు తప్ప ఏ మొగాడూ నీకు దొరకలేదూ, చావు, చావు! అంటూ వీపున చీపు రాడించ సాగింది.

తలవని తలంపుగా జరిగిన యీవింత అవమానానికి యింట్లో వున్న ఆడవాళ్ళందరూ ఆశ్చర్య పడ్డారు ఏమీ తోచలేదు. చిన్న పిల్లలు ఏడుస్తూ మంచాలక్రిందా, బీరువాల చాటునా దాకున్నారు. అంట్లు తోముతున్న దాసీది గాబరా పడి, అంట్లువదలి వీధివెంట పోలీసులను కేక వేస్తూ పరుగెత్తింది.

ఇంట్లోవున్న తక్కిన ఆడవాళ్ళంతావచ్చి రసమయిని పట్టుకొన్నారు. రసమయి యిక యజమానురాలిని వదలి పెట్టి, పట్టుకున్న వాళ్ళను కొరుకుట, గిల్లుట, వారిపై వుమియుటా సాగించింద. ఒకతె చీర చిరిగిపోయింది, ఇంకొకతె జుట్టు వూడింది, వేరొకతె శరీరంమీద గాట్లు పడ్డాయి. రసమయి రొప్పుతూ, ఏదీ పెళ్ళికూతురు? నాఎదుటికి తీసుకొనిరండి కళ్ళు వూడపీకి, ముక్కుకోసి, చెంపలు పగలుగొడతాను" అంది.

దురాలా యిప్పటివరకూ చూస్తూ వూరుకుంది. గుమ్మం ముందు వీధిలో జనం అంతా గుమిగూడారు. ఆగందరగోళం చూసి, రసమయీ, ఆగు ఆగు ఇక క్షమించి వదిలిపెట్టు బాగా శాస్తి జరిగిందిలే. ఇంటికిపోదాం, పద అంది.

"దాసీది పరుగెత్తుకుంటూ యింట్లోకి వచ్చి వీళ్ళను పోనివ్వకండి స్టేషనుకు వెళ్ళి చెప్పాను. ఇనస్పెక్టరుగారు వస్తున్నారు" అంది.

పోలీసు పేరు వినగానే కంగారు పడుతూ రసమయి అప్పగారిని పదమని తొందర పెట్టింది.

"పోయేది ఎక్కడికి? ఇనస్పెక్టరును రానీ వెనుకగాని 'అంటూ యిద్దరు ముగ్గురు స్త్రీలు రసమయిని పట్టుకొనుటకు ముందుకు వెళ్ళారు.

రసమయి రవిక చింపుకొని, శరీరం మీద గాట్లు చేసికొని "చంపారు, నన్ను చంపారు, మీ ప్రాణాలు తీసి నేను కూడా పురిపోసుకు చస్తాను. అంటూ విరుచుకు పడ్డది.

ఇది చూసి తక్కిన వాళ్ళంతా "భయంవేసి యిద్దర్నీ బయటకు నెట్టి తలుపులు వేసికొనిరి. "పారిపోతున్నారని "కేక వేస్తూ దాసీది వీధివెంట పరుగెత్తుకు పోయింది.

ఇంతలో రసమయి, దులార యిద్దరూ బండీలో ఎక్కి కూర్చున్నారు. బండీ వెళ్ళిపోయింది.

## 4

సరయూ ప్రసాదు దయాళుకు తన కూతునిచ్చి వివాహం చెయ్యలేదని చెప్పనక్కరలేదు. "అతని భార్యా ప్రసాదుతో తమ పిల్ల మొదటిపెళ్ళాంతో నెగ్గటం చాలా కష్టమనీ ఆ గయ్యాళి తమపిల్ల ప్రాణాలు తీస్తుందనీ సంబంధం వదులుకోవటమే మంచిదనీ చెప్పింది."

మర్నాడు సరయూ ప్రసాదు వల్ల దయాళు జరిగిన సంగతి అంతా విన్నాడు. కోపం వచ్చి అతనికి వొళ్ళు మండి పోయింది.

దయాళు కచ్చేరీనుంచి యింటికివచ్చి, కాళ్ళు చేతులు కడుక్కుని, లోపల కూర్చుని చుట్ట కాలుస్తున్నాడు. ఇంతలో తుఫానువలె రసమయి యింట్లోకివచ్చింది. రెండుమూడు నిము షములవరకు మెదలకుండా దయాళువైపు రెప్పవాల్చకుండా తీవ్రంగా చూసింది. ఆమె దృష్టిలో పడ్డ వ్యక్తి భస్మం అయి పోయేటంత భయంకరంగా చూసింది

దయాళు గాభరాపడి "ఏమిటి ?" అన్నాడు.

"శ్రాద్ధం పెట్టేందుకు వచ్చాను"

"ఎవరికి ?"

"సరయూ ప్రసాదు కూతురుకూ, అతని భార్యకూనూ"

"అయితే రెండు శ్రాద్ధాలు అను. వాటితోపాటు నీ శ్రాద్ధానికికూడా సిద్ధం చేసుకో ?"

"అదీ జరుగుతుంది. ముసలితనం వచ్చాక పెళ్ళిచేసు కోవాలని బుద్ధి పుట్టిందటగా ?"

దయాళు నోటినుంచి చుట్టతీసి కోపంతో "ఏం? ఎందుకు బుద్ధి పుట్టకూడదూ ? నీకు ఝడిసి మానుకుంటాననుకు న్నావా ?" అన్నాడు.

రసమయి చేతులు నలుపుతూ, "చేసుకోండి, చేసు కున్నాకగానీ తెలియదు !

"ఏం చేస్తావు ?"

"అబ్బే, ఏమీం లేదు. పెళ్ళికూతురు ముక్కు కోసేసి, రొమ్ముమీద పెద్ద బండ పడేస్తాను."

"ఎవరన్నా నీ ముక్కూ, చెవులూ కోస్తేనో?"

"రండి, కొయ్యండి. మీరేకొయ్యండి. ఎవరో ఎందుకూ!"

అని రసమయి నడుముమీద రెండువైపులా చేతులు పెట్టుకుని, వంగి దయాళు మొగం దగ్గరగా నుంచుంది.

తన భార్య అంత నమ్రతగా దగ్గరకు రావటం చూసి, చుట్టను మళ్ళా నోట్లో పెట్టుకున్నాడు. వంగివున్నందువల్ల నోట వుమ్మి వచ్చినప్పుడు తెలసికొని రసమయి కొంచెం దూరంగా పోయి నుంచుని "అయితే కత్తికి పదును పెట్టుకు వుంచుకుంటాను. సంబంధం కుదిరాక కబురు చెయ్యండి. ఎవరికీ తెలియకుండా ముడి పెట్టుకునేరు!" అంది.

"నువ్వు చావందే రెండో పెళ్ళి చేసుకోను. ఎప్పుడు చస్తావు?"

ఈమాటవిని రసమయి వికటంగా నవ్వుతూ "చెప్పనా? ఇప్పుడప్పుడే కాదు. ఇంకా కొన్నాళ్ళు పోవాలి. నీకు రెండో పెళ్ళి చేసుకునే యీడు పోయాక, కళ్ళు కనిపించకుండానూ నడవలేకుండానూ వున్నాక చస్తాను" అంది.

భార్యా, భర్తల సంభాషణ యింతవరకు వచ్చింది. ఇంతలో బయట వీధిగుమ్మంవద్ద ఏదో బండివచ్చి ఆగిన శబ్దం అయింది.

రసమయి "ఈమాట మీాదే వుండండి. వెడుతున్నాను" అని వెళ్ళిపోయింది.

## 5

పై విధంగా సంభాషణ జరిగి ఆరుమాసాలయింది. రసమయి పొగరు యింకా తగ్గలేదు. మంచంమీాద పడివుండి, మృత్యుఘడియల్ని లెక్కిస్తూ వుంది.

ఈ వార్తను విని దయాళు వచ్చి, ఎన్నో వైద్యాలు చేయించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. చివరకు ఒక నాడు దేహాన్ని చాలించింది.

దయాళు గంగానది ఒడ్డున కర్మకాండ జరిపాడు. "మమత్వం" అతి విచిత్రమయింది. ఇన్ని కష్టాలు పెట్టిన రసమయి మరణించినందుకు దయాళు కంటతడి పెట్టకుండా వుండ లేక పోయాడు.

మరి ఆరు మాసములు గడచినవి. దయాళు మిత్రులందరూ పిల్లకోసం వెతక సాగారు. చివరకు దగ్గరలోనే ఫూల్ పురంలో ఒక పిల్ల వున్నట్టు తెలిసింది. ఏదోవంక పెట్టుకుని దయాళు స్వయంగా వెళ్ళి పిల్లను చూసుకు వచ్చాడు. పిల్ల బాగానే వుంటుంది. పిల్లతండ్రి ఆ గ్రామ జమీాందారిణిగారివద్ద మేనేజరుగా పని చేస్తున్నాడు. వారి వ్యాజ్యాలు కూడా తనకే వస్తవి. పిల్లతండ్రి దుర్గాదీన్ బాగా ఇంగ్లీషు చదువుకున్న వాడు కూడాను.

పిల్లను యిచ్చేందుకు ఖాయపరుచుకున్నారు. రేపు తాంబూలాలు పుచ్చుకుంటారు. పెండ్లికొడుకువైపున తాంబూలాలు పుచ్చుకునేందుకు దయాళు పింతండ్రి వచ్చాడు. ప్లీడరుగారు ఆఫీసు గదిలో కూర్చుని పార్టీలతో ఏదో మాట్లాడుతూ వున్నారు. పింతండ్రిగారు "వెంకటేశ్వర సమాచార్" అనే పత్రిక చదువుతూ వున్నారు. ఈసమయముకు తపాల బంట్రౌతు వచ్చి దయాళుగారికి ఒక లేఖను యిచ్చి వెళ్ళాడు.

కవరుమీద వ్రాసివున్న దస్తూరీ చూడగానే దయాళుగారికి తల తిరిగినట్లనిపించింది. రెండు మూడు మారులు కళ్ళు నలుపుకుని చిరునామాను చూడ సాగెను. ఒకసారి కనులకు కనులకు దగ్గరగా వుంచుకుని, మరొకసారి దూరముగా వుంచుకుని చూచాడు.

చివరకు వణకుచున్న చేతులతో కవరు చించి లోపల విషయములను చదివేప్పటికి అతని మొగము వేలబడింది. పార్టీలవైపు చూచి "సరే, పదండి. ఇవ్వాళ కొంచెం పెందలకడనే కచ్చేరీకి వస్తాను, మిగతా సంగతులను అక్కడ మాట్లాడుకుందాము" అని వారిని పంపించేశాడు.

పార్టీలు వెళ్ళిపోగానే దయాళు పింతండ్రి వచ్చి "వుత్తరం వచ్చిందా ?"

"మరే"

"ఎక్కణ్ణించి ?"

"అదే ఆలోచిస్తున్నాను"

దయాళుని ముఖకవళికను చూసి పింతండ్రి అతనిదగ్గరకు వచ్చెను ఆ సమయాన దయాళు రెండవమారు ఆ వుత్తర మును చదువుచుండెను. అతనికి శ్వాస స్తంభించి పోయింది. తలనిండా చెమటలుపోశాయి.

పింతండ్రి తొందరపడుతూ ఏమిటి ? దుర్వార్త కాదు గదా ? అనెను.

దయాళు మెదలకుండా ఆ వుత్తరమును పింతండ్రికి యిచ్చెను. అతడు కళ్ళజోడు తగిలించుకుని గుమ్మమువద్ద నుం చుని వుత్తరమును చదువసాగెను. మామూలు వుల్లిపొరలాటి కాగితంమీద వూదాసిరాతో వుత్తరం వ్రాసివుంది. తారీఖు గాని వ్రాసినచోటుగాని లేదు. అందలి విషయము యిది.

శ్రీ

మీకు మతిపోయింది. రసమయి చచ్చిపోయింది. ఇక నాపీడ వదిలింది. రెండవపెళ్ళి చేసుకుందామని అనుకుంటు న్నారు. నేను చచ్చిపోయినంతమాత్రాన పోయాననుకుంటున్నా రేమో ! మీ యింటి ఎదుటవున్న పెద్ద మర్రిచెట్టుమీద ప్రస్తుతం వుంటున్నాను. మీరు ఎక్కడికి వెడుతున్నారో, ఏంచేస్తున్నారో అంతా యిక్కడ కూర్చుని చూస్తున్నాను. రాత్రిళ్ళు చెట్టుదిగి ఒక్కొక్కప్పుడు మీ పడకగదిలోకి వచ్చి మంచము చుట్టూ ప్రదక్షిణము చేస్తున్నాను. ఒక్కొక్కప్పుడు మీ గొంతు నులిమివేసి చంపేద్దామనిపిస్తున్నది. ఇక్కడ నాకు ఒక్కతైకు తోచటల్లేదు. నా మొగము వాడిపోయింది.

నా శరీరం మునుపటివలె లేదు. చిక్కిపోయాను. ఎముకలుతప్ప ఏమీలేదు. గంగానది వొడ్డున నన్ను కాల్చివేశారు. అందు వల్ల శరీరం అంతా నల్లగా కమిలిపోయింది. పోనివ్వండి. నన్ను గురించిన వర్ణనవలన ప్రయోజన మేమీలేదు. పెళ్ళి చేసుకో వద్దు. చెడిపోతారు.

రసమయి.

అనివుంది. ఆ వుత్తరం చదవగానే పింతండ్రి మొగం కూడా వాడిపోయింది. బెదరి పోయిన గొంతుతో "ఈ రాత ఎవరిదో గుర్తు పట్టగలవా ?" అన్నాడు,

"ఆ. బాగాగుర్తుంది. దానిదే"

"ఎవరూ మోసగించ లేదుగదా ?"

"దేవుడికి తెలియాలి"

పింతండ్రి దగ్గరగావున్న కుర్చీలో కూర్చున్నాడు. కొంచెం సేపటివరకు యింటివాసాల వైపు చూస్తూ "జయరామ్-సీతారాం - రాఘువరాం - రాం - రాం" అని దైవస్మరణ చేయసాగాడు.

పింతండ్రిగారి స్థితిని చూచేప్పటికే దయాళుకు భయం యింకా ఎక్కువయింది, అతనివైపు చూసి "బాబాయీ, భూతాలు వుత్తరాలు రాస్తాయా ? అని ప్రశ్నించాడు.

"భూతంకాదు; దేవయోని సంభూతరా - ఏదో ఉపదేవతరా - జయ్ భజరంగ్, జయ్ వీరహనుమాన్కీ."

ఇద్దరూ మెదలకుండా వూరుకున్నారు.చివరకు పింతండ్రి దయాళు బాబుతో "చూడు" ఎవరి కొంటెపనీ కాదుగదా ?

ఇలా ఎక్కడనైనా జరుగుతుందా ? రకరకాల భూతాలను గురించీ, దేవయోనిసంభూతులను గురించీ, వారుచేసే దుండగాలను గురించీ విన్నాను. కాని, ఇలాటి సంగతి ఎవరివల్లా వినలేదు. సరేగాని, అమ్మాయి రాసినపాతవుత్తరం ఏదైనా వుంటే నెతికి తీసుకురా- చూద్దాము ?

"పాత వుత్తరాలు వున్నాయి! అని లోపలికి వెళ్ళి నాలుగయిదు పాత వుత్తరములను తీసుకొని వచ్చెను."

పింతండ్రిగారు కళ్ళజోడు అద్దములను రెంటినీ శుభ్రముగా తుడిచి, జోడు తగిలించుకొని యీ రెంటి వ్రాతలనూ జాగ్రత్తగా పరీక్షించ సాగారు. చివరకు వుత్తరములను అన్నిటినీ టేబులుపై పడవైచి, దీర్ఘముగా నిట్టూర్పు విడచి "ఒకే దస్తూరిగా కనిపిస్తున్నాయి" అని వచ్చిన కవరును వెనుకముందు త్రిప్పి చూడసాగాడు. మామూలు అణాన్నర కవరే. ఆకవరును దయాళు చేతికియిచ్చి, 'ఏపోస్టాఫీసుస్టాంపో చూడు' అన్నాడు.

దయాళుడుర్దూ చదివిన ప్లీడరైనప్పటికి యింగ్లీషు అచ్చు అక్షరములను చదువగలడు. పోస్టుముద్రను పరీక్షగా చూచి – 'ప్రయాగ దారాగంజ్ ముద్ర నిన్నటి తారీఖుతోవుంది' అన్నాడు.

పింతండ్రి ఏమీ మాట్లాడలేదు. మధ్య మధ్య సన్నని గొంతుకతో "జే, జే, రాం, సీతారాం" అని మాత్రం అంటు వున్నాడు.

కచ్చేరికి వెళ్ళవలసిన సమయం సమీపించుటవల్ల దయాళుడు వెంటనే లేచి స్నానంచేసి, భోంచేసేందుకు కూర్చు న్నాడు. వంట యింటివసారాలో, అతడు భోంచేసేందుకు కూచున్న చోటుకు ఆమర్రి చెట్టుపై కొమ్మలు కనిపిస్తూవుం టాయి. అతడు చూస్తుండగానే ఆచెట్టుకొమ్మలు, ఒకసారి ఎవరో వూపినట్టుగా వూగాయి. ఎవరో 'కిచ కిచ' నవ్వినట్టు వినిపించింది. భయంవేసి భోజనం పూర్తిచేసుకోకుండానె లేచా డు. చేతులు-మూతి కడుక్కొని కొంతసేపటి వరకు మర్రిచెట్టు నైపుకు చూస్తూ నుంచున్నాడు. రెండుమూడు పక్షులు వాటిలోఆవి పోట్లాడుకుంటూ వున్నాయి కొన్ని కాకులు తమ సహజమైన సంగీతాన్ని ఆలాపనచేస్తున్నాయి. ఇంతకుమించి అతనికి ఏమీ కనిపించలేదు.

## 6

ఆరోజు సాయంత్రం పింతండ్రి దయాళూ కూచుని గదిలో మాట్లాడు కొంటున్నారు. పైన పగలల్లా కనపడ్డ ప్రతి తలుపు మీద గోడలన్నిటి పైన 'రామ రామ' అని పింతండ్రి వ్రాశాడు. ఆరోజు యిద్దరూ ఒకే మంచంమీద పడు కునేందుకు నిశ్చయించుకున్నారు. దిండుక్రింద తులసీ రామా యణము పెట్టి వుంచేందుకు, రాత్రి అంతా దీపమును వెలిగించి వుంచేందుకూ ఏర్పాటు చేసుకున్నారు.

దయాళు – "ఏంచేద్దాం బాబాయీ? పెళ్ళి ఆపెయ్యా ల్సిందేనా."

"అంత అవసరం లేదనుకుంటాను."

"ఏమీ ప్రమాదం, రాదు గదా?"

"పింతండ్రి కొంచెంసేపు ఆలోచించి" భయపడ వలసిం దేమీ కనిపించటం లేదు.

"గొంతుక నులిమి వేస్తానని రాసింది

"ఆ, ఎప్పుడూ జరగదు. ఏమైనా నువ్వు దానికిభర్తవి.

"మరి పెళ్ళి చేసుకోవద్దనీ, చేసుకుంటే చెడిపోతావనీ రాసిందిగా."

'చెడిపోతావంటే - తను చెడగొడతాననీ అర్థమే కాదు. ముసలితనంలో పెళ్ళి చేసుకుంటే చెడిపోతావనికూడా కావచ్చును.

దయాళు మెదలకుండా వూరుకున్నాడు. లోపల భయం కూడా తక్కువగాలేదు; పెళ్ళిచేసుకోవాలనే ఆశకూడా బలీయంగానే వుంది.

మర్నాడు తాంబూలాలు పుచ్చుకున్నారు కాని, భూతం రాసిన వుత్తరపు సంగతులు నలుగురికీ తెలియటానికి ఎక్కువ సేపు పట్టలేదు. క్రమక్రమంగా పెళ్ళికూతురుతండ్రికి కూడా తెలిసింది. ఆయన యీవార్త విని పకపక నవ్వాడు. ఆయన యింగ్లీషు చదువుకున్నవాడు కూడా అవటంవల్ల, యీ మాట మీద ఆయనకు ఏమాత్రం నమ్మకం కలుగలేదు.

లగ్న నిశ్చయం కూడా జరిగింది. ఇక అయిదురోజులు గడువుంది. ఇరుపక్షాలవారూ పెండ్లి ప్రయత్నాలలోవున్నారు. ఆరోజు మూడవఝాము వేళ దయాళు తనగదిలో స్నేహి

తులతో కూర్చుని వున్నాడు. వీరిలో నారాయణబాబు అనే ఆయన గవర్నమెంటు ప్లీడరు. నలభయిసంవత్సరాల పైగా వయస్సుంటుంది. కళ్ళకు బంగారు తీగెల కళ్ళజోడు తగిలించి వుంది. తలజుట్టు వుంగరముల వలె చుట్టుకుని వున్నది. పెద్దపెద్ద మీసములు, బారైనగడ్డమూ వుంది. చేతిగోళ్ళు పెరిగి వున్నాయి. దీనికంతకు కారణము-ఆయన థియోసఫిస్టు (దివ్య జ్ఞాన సామాజికుడు) కావటమే. దయాళుకు భూతం వృత్తాంతం రాసిందని విని, అతడు దానిని యింకనూబలపరచ సాగాడు. ఈయనగాక యింకొక నవయువకుడున్నాడు. పేరు విశ్వనాథ్. ఎం. ఏ. ప్లీడరు పరీక్ష తప్పాడు. చాలా ఆంగ్ల నవలను చదివిన వాడు. ఆయన దయాళుతో

"రఘువరబాబూ, ఒక సంగతివుంది.

నేను ఎన్నో నవలలు చదివాను వాటిలో ఎక్కడ చూసినా- రైళ్ళు ఢీకొన్నాయనీ, పడవ మునిగిపోయిందనీ- ఫలానా మనిషి చచ్చిపోయాడని అందరూ అనుకున్నారనీ- చూసినవాళ్ళుకూడా వున్నారనీ, వ్రాశివున్నాయి. పుస్తకం అంతా చదివేప్పటికి చివరకు ఆమనిషి బ్రతికే వున్నాడని తేలు తోంది. నావుద్దేశ్యంలో మీభార్య బ్రతికైనా వుండాలి, లేదా యీవుత్తరం ఎవరైనా కల్పించింద్రైనా అయివుండాలి. ఆ దస్తూరీ మీభార్యదేగాని మరెవరిదీ కాదని నమ్మకంగా మీరు చెబుతున్నారు. అందువల్ల ఆమె బ్రతికి వున్నదని నమ్మవలసి వస్తోంది. ఎందుకంటే, యీ యిరవయ్యో శతాబ్దంలో

దెయ్యాలు, భూతాలు - అంటే ఎవరూ నమ్మేవారులేరు కాబట్టి" అని అన్నాడు.

ఇది విని థియోసఫిస్టు, నారాయణబాబు ఈఇరవైయ్యో శతాబ్దంలో కూడ మీరు నమ్మలేకుండా వున్నారా? అని అన్నాడు.

'ఆ. నేను ఎప్పుడూ ఏభూతాల్ని చూడలేను. అందుకని ఏమాత్రం నమ్మకంలేదు'

'ఏడవ ఎడ్వర్డు చక్రవర్తిగారిని ఎప్పుడైనా చూచారా?

'లేదు'

'ఆయన వున్నారని మీరు నమ్ముతారా?

'ఆ' నమ్ముతాను. దానికి కారణం వేరు నేను చూడకపోయినప్పటికీ అనేకులు వారిని చూచారు. ఆయన ఫోటోలను పది - పదిహేనింటిని చూచాను కూడాను. కాని, యీరోజు వరకు భూతాన్ని నేను స్వయంగా చూశానని ఎవరూ చెబుతూ వుండగా వినలేదు. ప్రతివారూ, ఎవరో ఒక నమ్మదగ్గవారు భూతాలను చూశామన్నారనే అంటారు."

నారాయణబాబు తన పొడుగాటి గడ్డమును చేతితో సవరించుకుంటూ "చక్రవర్తిగారిని చాలామంది చూశారని మీరంటున్నారు. అదేవిధంగా అనేకమంది అశరీర ఆత్మల్ని చూశారు. చక్రవర్తి ఫోటోలు 10,15 చూశామంటున్నారు. అలాగే 10, 15 భూతాల ఫోటోలను కూడా నేను చూపించగలను. చూడాలని వుంటే, ఒకరోజు మాయింటికి రండి. నా దగ్గర ఒక పుస్తకంలో కేటీ, కింగ్ ఫోటో వుంది. మొదటి ఛార్లెస్ కాలంలో కేటీ కింగ్ అనే బాలిక వుండేది. పదహారవ

యేట ఆమె చనిపోయింది. గత శతాబ్దంలో అమెరికా యూరప్ ఖండాలలో అనేకచోట్ల ఆమె స్థూల శరీరంతో కని పించింది. ఆమె నాడిని పరీక్ష చేశారు. శరీరంలో బాకులు పొడిచి చూచారు. మామూలు మనిషికివలెనె ఆమె శరీరంలో నుంచి రక్తం కారింది. ఆమె ఫోటోకూడా తీశారు. ఫోటో అచ్చు ప్రతి నాపుస్తకంలోవుంది. చూపిస్తానురండి" అన్నాడు.

విశ్వనాథ్ మందహాసముచేసి "ఎంత అమాయకులండీ మీరు! ఇదంతా నిజమే ననేనా మీ అభిప్రాయం? భూతాలు వున్నాయని చెప్పేవాళ్ళ కల్పనా కథలు ఎన్నో బయటపడ్డాయి. కేటీ, కింగ్ శరీరంలో కత్తితో పొడిస్తే నెత్తురు కారిందన్న సంగతిని నిజమని నమ్మి చెప్పారు. నాకు ఏమీ నమ్మకం కలగ లేదు. ఎదురుగా మానవరూపం కనిపించి, కత్తితో పొడిచి నప్పటికీ నెత్తురు కారకపోయినట్లైతే, అది మనిషికాదననీ భూతమనినీ నమ్మేందుకు అవకాశం వుంది. కాని అలా జరుగ నప్పుడుభూతమేనని ఎలానమ్మగలుగుతాము? పోనీ, యీభూతం సంగతి చూద్దాము. మర్రిచెట్టుమీద వున్నానని రాసింది. అది నిజంగా వుత్తరమే రాయగలిగితే, స్థూల శరీరంతో వచ్చి "నేను వున్నాను, పోలేదు" అనీ చెప్పేది. అలా తేలికగా చెప్పేందుకు వీలయినప్పుడు, కలం కాగితం, సిరా వీటన్నిటి కోసం ఎందుకు బాధపడాలి? మెదలకుండా టేబులుమీద పెట్టేం దుకు వీలైనప్పుడు, మైలుదూరంపోయి పోస్టాఫీసులో పడెయ్య వలసిన అవసరం ఏంవచ్చింది? అలా చేస్తే పోస్టుబిళ్ళలతో పనిలేకుండా పోయేదిగదా! భూతాల రాజ్యంలో డబ్బుయింత

చాకగావుంటే పదండి; అక్కడకుపోయి ప్రాక్టీసు పెడదాము" అన్నాడు.

నారాయణబాబు కొంచెం నొచ్చుకుని "నేను వేళా కోళంగా చెబుతున్నాననుకుంటున్నారు. కాదు నిజంగానే చెబుతున్నాను. ఎంతో పరిశీలనచేసి తెలుసికొననిదే యిలాటి విషయములను గురించి అభిప్రాయం యివ్వగూడదు. భూతాలు వుత్తరాలు రాయటం యిదే మొదటిసారి కాదు. కుటుంబీ లాల్ అనే ఒక మహాత్ముడు బ్లావెట్స్కీ అమ్మగారికి యిలాగే ఎన్నో వుత్తరాలు రాశాడు. వారు కూడా తలచినట్లైతే స్వయంగావచ్చి టేబులుమీద వుత్తరాలు పెట్టి వెళ్ళేవారే. కాని అలా చెయ్యలేదు. ఇదే విధంగా పోస్టుద్వారానే వుత్తరాలు పంపారు అన్నాడు.

ఇది విని విశ్వనాథబాబు మెల్లమెల్లగా మందహాసము చేయుచూ "కుటుంబీలాల్ వుత్తరాలను చాలాకాలం క్రితమే కల్పితపు వుత్తరాలని ఋజువు చేశారు. డాక్టర్ హాడ్సన్ అనేవారుస్వయంగా భారత దేశానికివచ్చి బ్లావట్స్కీ, దామోదరుడు-అనే యిద్దరూ యీతంత్రం చేశారని ఋజువు చేశాడు.

ఇది విని థియోసఫిస్టు నారాయణబాబు మొగము చిట్లించుకుని - అసూయంతోవున్నడే అలాంటివాళ్ళ పుస్తకాలు చదవకండి. నాదగ్గరికి రండి. మంచిమంచిపుస్తకాలు యిస్తాను. బ్లావట్స్కీ అమ్మవారి మహత్తు, ఆమె రాసిన 'ఐశిస్ అన్ వెల్డు' చదివితే తెలుస్తుంది.

'అది చదవలేదుగాని, ఎడ్మండ్ గ్యారెట్ రాసిన "ఐసిస్ వెరీ మచ్ అన్‌వెల్డ్ - ఆర్ - ది స్టోరీ ఆఫ్‌దీ గ్రేట్ మహాత్మాహోక్స్' చదివాను. లైబ్రరీలో వుంది. చదువుతానంటే తెచ్చి పెడతాను'

ఈమాట వినేప్పటికే నారాయణబాబు పట్టరానంత కోపంతో' మీలాటివారు నేర్చుకున్నది ఇదే! ప్రపంచంలో నిందించని వస్తువేదీలేదు. బ్లావట్స్కీ అమ్మగారిని దుర్మార్గులు వృథాగా నిందించారు' అన్నాడు.

ఇంతలోనే బయటినుంచి తపాలా బంట్రోతు 'వుత్తరమండీ' అంటూ లోపలకు వచ్చి దయాళు చేతికి ఒక వుత్తరం ఇచ్చి వెళ్ళిపోయాడు. ఆవుత్తరాన్ని చూచి, కంగారుపడుతూ 'చూడండి బాబాయి, అదే రాసింది, అని కవరు చించి వుత్తరాన్ని వాళ్ళముందు పడవేశాడు. థియోసఫిస్టుబాబు శ్రద్ధతో ఆవుత్తరాన్ని చదివి, విశ్వనాథబాబుకు యిచ్చాడు. అందులో:-

## శ్రీ వారికి

యింత సాహసమా! తాంబూలాలుకూడా పుచ్చుకున్నారు కాదూ? నామొదటి వుత్తరాన్ని గుండులేని తుపాకి మ్రోతగా తలచి వుంటారు. రసమయి అంత తెలివితక్కువది కాదు. నేను వద్దన్నకొద్దీ వివాహం చేసుకుంటున్నారు. ఇప్పటికి మించిపోయింది ఏమీ లేదు. ఇకనైనా జాగ్రత్తపడండి. మీదుర్బుద్ధిని విడవండి. లేకపోతే, ఎప్పుడో ఒకరోజు రాత్రి

మీరు నిద్రపోతున్నప్పుడు మర్రిచెట్టు దిగివచ్చి, పదిమణుగుల రాయి రొమ్ముమీద పడేసి పోతాను. ఆనిద్రలోనే దీర్ఘనిద్ర పోతారు.

రసమయి.

ఒకరితరువాత ఒకరుగా అందరూ ఆవుత్తరాన్ని చదివారు. అందరికీ ఆశ్చర్యమయింది. పాపం విశ్వనాథ బాబు కూడా మొగం తేలవేశాడు. అయినప్పటికీ సంశయమును విడచి, దయాళుబాబూ యింకొకసారి దస్తూరిని జాగ్రత్తగా పరీక్షచేసి చూడండి. ఇది ఆమెదస్తూరీయో, యింకెవరిదైనానో?" అన్నాడు.

"అబ్బే, ఏమీ సందేహంలేదు. దస్తూరీ సరిపోయినప్పటికి "ఏమో" అనుకోవచ్చును, అది ఏతప్పులు రాస్తూ వుండేదో, ఆతప్పులే వీటిలోనూ వున్నాయి. అది బ్రతికివుండగా ఏ మంటూ వుండేదో. ఆమాటలే యిందులో రాసివున్నాయి.

ఎవరూ ఏమీ అనలేకపోయారు. కొంచెం సేపు అయాక విశ్వనాథబాబు గొంతు సవరించుకుని ఆమె చచ్చిపోయినప్పుడు మీరు అక్కడే వున్నారా?

"ఆ"

"శవంతో పాటుస్మశానాని కూడా వెళ్ళారా?

"ఆ."

"చితిమీద శవాన్ని ఎక్కించేప్పుడు ఆమె ముఖాన్ని చూచారా?"

"ఎందుకు చూడలేదు? నేనే కోరివి ముట్టించాను. మీరు సందేహించ నక్కరలేదు.

ఏమీాలోచక విశ్వనాథబాబు తలవంచుకుని కూర్చున్నాడు.

ఇంకొకరు, "There are more things is haeven and earth, Horatin, Than are dreamt of io you Philosophy" (ఓ హోరేషియో, స్వర్గమర్త్యలోకాలలో దర్శన విజ్ఞాన శాస్త్రము స్వప్నమందైనను తెలసికొనజాలని ఎన్నో విషయములున్నవి.)

మరొకరు—నిజమే. మన దేశంలో - మన దేశంలోనే కాదు. ప్రపంచమందలి అన్ని దేశములలోను గల యీ పిశాచములు కలవనే నమ్మకం నిరాధారమని త్రోసి పుచ్చేందుకు వీలులేదు.

"మూఢ విశ్వాసము కానే కాదు. గత యాభై సంవత్సరాల్లోను యూరోపు, అమెరికా ఖండాలలో యీ విషయం నిజమేనని రుజువయింది. ఒకప్పుడు విఖ్యాత విజ్ఞానశాస్త్రవేత్త టిండల్ కూడా యీ మాటను విని పరిహసించాడు. కాని, యిప్పటి విజ్ఞానశాస్త్ర వేత్తలకు ఆ భావంలేదు. విఖ్యాత గ్రంథకర్త స్టెడ్ తన గ్రంథంలో ఒకచోట "Of all the valgar Superstitions of the half-eoncated, nonedies harder than the absurd delusion that there are no such things as ghosts" (మిడిమిడి జ్ఞానం గలవారికి యితరులతో పాటుగల కుసంస్కారము లన్నింట "భూతములు లేవు" అనెడి విచిత్రమైన భ్రమయే

అన్నిటికంటె ప్రధానమైనది) అన్నాడు," అని చెప్పి నారాయణబాబు విజయము పొందిన వీరునివలె విశ్వనాథబాబువైపు చూడ సాగాడు.

సాయంత్రం అయింది. ఎవరి యిండ్లకువారు పోసాగారు. ఆ మర్రిచెట్టు క్రిందినుంచి పోవునప్పుడు విశ్వనాథబాబు ఒడలు కూడ పులకరించింది.

# 7

పింతండ్రి ఎక్కడికో వెళ్ళి సాయంత్రం అయాక యింటికి వచ్చినప్పుడు రెండవ వుత్తరం కూడా వచ్చిందన్న మాట విని దయాళూ "పరిస్థితి రానురాను విషమిస్తున్నది. వివాహాన్ని ఆపేందుకూ వీల్లేకుండా వుంది. యేడాది పూర్తి అయాక గయకు వెళ్ళి సంవత్సరీకాలు పెట్టుకుంటే యీ బాధ తప్పిపోతుందని నా అభిప్రాయం. ఇంకొక నెలకు సంవత్సరం ఎలాగూ పూర్తి అవుతుంది. అప్పుడు నిశ్చింతగా యీ శుభకార్యం చేసుకోవచ్చును" అన్నాడు.

"సరే, అలాగే చేద్దాము"

పెళ్ళి కుమార్తె తండ్రితో చెప్పి ఒక నెల తరువాత ముహూర్తం పెట్టించారు. ఆహ్వానాలు పంపిన వారికందరికీ యీ సమాచారాన్ని తెలియజేశారు. మొదటి భార్య సంవత్సరీకాలు అయిన తరువాత రెండవ వివాహం చేసుకుంటాడన్న సంగతి అందరికీ తెలిసింది.

దయాళు ఇవ్వాళ కోర్టులో ఒక పెద్ద వ్యాజ్యంలో వాదించవలసివుంది. విచారణ ప్రారంభం కానున్నది. అది పూర్తి కానిదే దయాళబాబు గయకు వెళ్ళి పిండాలు పడ వేయుటకు వీలులేదు. ఫిర్యాదీ తరఫున సాక్షులను పగలల్లా సాక్ష్యం చెప్పాల్సిన సంగతులను నేర్పుతూవున్నాడు

రేపు దావావిచారణ ప్రారంభం అవుతుందనగా యివ్వాళ రసమయివద్దనుంచి మూడవ వుత్తరం వచ్చింది. అందులో ఏవేవో విషయాలు వున్నాయి. చివరకు—

"గయలో నాకు పిండాలు వేసేందుకు వెడుతున్నారని విన్నాను. పిండాలు వేసినందువల్ల నాకు ముక్తివస్తుందనీ, య థేచ్ఛగా వివాహం చేసుకోవచ్చుననీ ఆలోచించి నట్టున్నారు. గయకే వెళ్ళే టట్లైతే, నేను దొంగవేషం వేసుకొని రైలు బండిలోనే మీ ప్రాణాలు తీస్తాను" అనివుంది.

దయాళు యింటికిపోలేదు. కోర్టునుంచి తిన్నగా నారా యణబాబు యింటికి వెళ్ళి, ఆయనకు యీ వుత్తరాన్ని చూపిం చాడు.

నారాయణబాబు వుత్తరమును చదివి, దీన్ని చూస్తే వూరికే వదలిపెట్టేటట్టులేదు. ఈ పరిస్థితిలో వివాహం మాను కోవటమే వుత్తమం అన్నాడు.

"అశరీరఆత్మ మనిషి ప్రాణాన్ని తీసెయ్యగలదా? దీన్ని గురించి మీ థియోసఫీ ఏమంటుంది?"

నారాయణబాబు అలమరలోనుంచి ఒక లావైన గ్రం థాన్ని తీసి, అందులో పేజీలు అటుయిటు త్రిప్పి "ఈ విష

యంలో" ముక్త ఆత్మలకు శరీరం వుండదని థియోసఫీ అభి ప్రాయము కాని, అప్పుడప్పుడు అవి తమంత తామే స్థూలశరీర రూప ధారణచేస్తవి. అటువంటివి గాలి చెట్లు, భూమి తమకు పరిసరాలలో వుండే మనుష్యుల శరీరములనుంచి కూడా తమకు కావలసిన పదార్థాన్ని తీసుకునే శక్తిగలిగి వుంటవి. అలాటి పరిస్థితిలో ప్రాణముతీసికొనుటలో ఆశ్చర్యమేమున్నది? చేతితో కలము పుచ్చుకుని వ్రాయగల పిశాచము, మనుష్యుని కత్తితో పొడవజాలదా?"

దయాళు కొంతసేపు ఆలోచించి, ఈవ్రాతలు నిజమో, కల్పితమో తెలిసికొనుటకు, హస్తలిపి - విజ్ఞానము గల విద్వాంసునికి (Hand-writing Expert) పంపించి పరీక్ష చేయిస్తే మంచిదేమో? అన్నాడు.

'అనుమానంగా వుంటే అలాచెయ్యవచ్చును !'

ఆమర్నాడు ఒక దావాలో సాక్ష్యం యిచ్చేందుకు (Hnad-writing Expert) డాక్టర్ మార్షల్‌గారు కోర్టుకు వచ్చారు. అచ్చటనే దయాళుబాబు రసమయి లేఖలను మూడింటినీ యిచ్చాడు. పరీక్షార్థము రసమయి వ్రాసిన మూడు - నాలుగు పాతవుత్తరములను కూడా యిచ్చాడు. అతడు రేపు వీటిని పరీక్షించి చెప్పెదననెను.

దయాళు మరునాడు ఉదయము గవర్నమెంటు వకీలు నారాయణబాబును వెంటబెట్టుకుని మార్షల్‌గారి వద్దకు వెళ్ళెను. అతడు వాటిని పరీక్షించి యివన్నియు ఒకే చేతితో వ్రాసినవేనని చెప్పెను.

ఇది విని దయాళుడు మొగమును చిన్నబుచ్చుకొనెను.

నారా—డాక్టర్‌జీ, సర్టిఫికెటు యిస్తారూ?

మార్షల్‌గారు యీకాగితములు ఏదో వ్యాజ్యంలో వుపయోగించుకునేందుకు - అనుకుని అప్పుడు మనం సాక్ష్యం యివ్వవలసివస్తుంది. అందువల్ల మంచి లాభం వస్తుంది' అని లోపల అనుకుని సంతోషంతో సర్టిఫికెటు వ్రాసియిచ్చాడు.

ఇంటికి వెళ్ళిపోవునప్పుడు నారాయణబాబు దయాళుబాబుతో డాక్టరుగారు యిచ్చిన సర్టిఫికెట్టూ—ఈవుత్తరాలూ Theosophical Review లో ప్రకటించేందుకు పంపించాలని వుంది. Sprit - writing అని చెప్పేదానికి యిదిచక్కని ఆధారంగా వుంటుంది. మీకేమైనా అభ్యంతరం వున్నదా? అని అడిగెను.

'అలాగే పంపించండి'

Theosophical Reivew మరునటి సంచికలో యివన్నీ ప్రకటింపబడ్డాయి. అనేకమంది థియోసఫిస్టులు దయాళుబాబుకు వుత్తరములువ్రాసిరి. కొందరు స్వయముగా ప్రయాగకువచ్చి చూచిపోయారు.

## 8

దయాళుబాబుకు దివ్యజ్ఞాన సామాజికులలో పేరు- ప్రతిష్ఠలు వచ్చినవి. థియోసఫిస్టు అనే ప్రతివాడికి దయాళుబాబు పేరు తెలుసును. కాని యిందువల్ల అతనికి ఏలాభమూ కలుగలేదు. ఈవుత్తరములు కల్పితములని రుజువైవున్నట్లయితే

రెండవపెండ్లి చేసికొని సుఖముగా నుండెడివాడే. చివరకు భయమువల్ల గయకుకూడా వెళ్ళి పిండప్రదానము చెయ్యలేదు.

చైత్రమాసం వచ్చింది. కచ్చేరీలకు ఎండాకాలపు శెలవులు యిచ్చారు. దయాళుబాబు యింటనే కూచుని తన దురదృష్టమునకు వగచుచుండెను. ఈసమయంలోనే ఎవరో వచ్చి ఝాన్సీలో మీఅత్తవారింట మీబావమరిదికి గాయము తగిలినదనిన్నీ, ప్రయాగ జెనరల్ హాస్పిటలులో ప్రవేశపెట్టారనీ చెప్పిపోయెను.

దయాళుబాబు యీవార్తను విని వూరుకొనజాలక పోయెను వెంటనే బాడుగబండిపై నెక్కి జనరల్ హాస్పిటలుకు వెళ్ళి బావమరిదిని చూచెను. అతనిప్రక్కనే దులార కూర్చుని ఏడ్చుచుండెను. దయాళుని చూడగానే యింకనూ అధికముగా ఏడ్వసాగెను.

పగలల్లా మందు యిచ్చుట, రోగికి శుశ్రూష చేయుచుండుటా జరిగినది. సాయింత్రికి డాక్టరు వచ్చి చూచి 'భయపడవలసిన పనిలేద' నెను.

దయాళుడు దులారతో 'సాయంత్రం అయింది. ఇంటికి వెళ్లు.'

దులార—తమ్ముణ్ని వదలిపెట్టి ఎలా వెళ్ళను?

'ఇవ్వాళ నువ్వింతవరకు స్నానం చెయ్యలేదు, భోజనం చెయ్యలేదు'

'అయినా సరే. వెళ్ళను.'

ఈపరిస్థితి చూచి హాస్పటలు డాక్టరు 'మీరు యింటికి వెళ్ళాలి. రాత్రిళ్లు యిక్కడ ఎవరూ వుండేందుకు. వీలులేదు. రేపు ఉదయాన తిరిగిరావచ్చును. భయపడనక్కరలేదు. కష్ట సమయం గడిచిపోయింది. మేము చూస్తూవుంటాము. మీరు యింటికి వెళ్ళండి' అన్నాడు.

దులార 'సరే'నని, దయాళుబాబుతో నన్ను యింటికి తీసుకు వెళ్ళండి రాత్రికిఅక్కడ వుంటాను. ఉదయాన మళ్ళా నన్ను యిక్కడ దింపండి' అంది.

దయాళుడు ఆవిధంగానే చేశాడు. ఆరాత్రి ఝూసీలో గడిచిపోయింది.

ఉదయాన లేచి దయాళుబాబు హుక్కా త్రాగుచుండెను. ఆసమయమున వీధిలో ఏదో గందరగోళము జరుగుచుండెను. హుక్కా అక్కడపెట్టి, తొందరగా వీధిలోకి వెళ్ళి చూడగా నాలుగువైపులా ఎర్రటోపీలవాళ్ళు ముట్టడించి వుండుట కనిపించింది స్వయముగా పోలీసు సూపరెంటెండెంటు గుఱ్ఱముపై నెక్కివచ్చి వీధి గుమ్మమువద్ద ఆగెను. అతని వెంట ఇన్స్పెక్టరు, హెడ్ కానిస్టేబులు వుండిరి.

పోలీసు అధికారి దయాళుబాబును ఎరుగును. అందుచే దయాళుబాబు అతనికి నమస్కారము చేసెను.

అధికారి నోటచుట్టను మీటుచూ, 'హల్లో' దయాళ్ బాబూ, యిక్కడ వున్నారేం?'

"మా అత్తవారిల్లు."

"మీ అత్తవారి యిల్లా? ఈ యింటిని చెర్చిచేయ్యాలి.

"ఎందుకని?"

"ఇక్కడ బాంబులు తయారు చేస్తున్నారేమో చూడాలి. ఇదిగో Search wanant-'అని వారంటు చూపించెను.

"దయాళుబాబు దానిని చూచి, అధికారికి యిచ్చి "అలాగే కానివ్వండి" అని అన్నాడు.

"ఆడవాళ్ళను అవతలకు పంపించండి."

పోలీసులు యింట ప్రవేసించిరి. ఇంట్లో దులార ఒక్కతే స్త్రీ ఆమె పోలీసులకు ఝుడిసి దాగి యుండవలసిన పనిలేదని తలచి, తులసిగాల పుచ్చుకొని' తులసికోట వద్ద గోవింద నామ స్మరణచేస్తూ కూచున్నది.

అన్వేషణ ప్రారంభమయింది.తుపాకులు, తుపాకిమందు, డైనమైట్, బాంబులు, వర్తమానసరణనీతి, యుగాంతర్, గీత, దేశవిషయము, రివ్యూ ఆఫ్ రివ్యూస్ - మొదలైనవి ఏవీ దొరకలేదు హిందూతీర్థ దర్శనము, కాశీపటము, జంత్రీ, తులసీరామాయణము. కాశీలో అమ్మె చౌకబారు నవలలూ దొరకినవి. జాతీయ నాయకుల పటములు ఏవీ దొరకలేదు. కాళీ, గంగ, గణపతి, లక్ష్మీ మొదలగు పటములు దొరికినవి. ఒకపాత కాగితాలకట్ట, ఒక పాత వుత్తరాలఫైలూ, దొరికినవి. దులారా పెట్టెలో ఒక వుత్తరాలకట్ట, చిరునామాలు రాసి వున్న ఒక కవర్లకట్టా దొరకింది.

దొరికిన సామానులను అన్నిటినీ వీధి అరుగుమీదకు తీసుకువచ్చి పడవేశారు. ఇన్స్పెక్టరుగారు సామానుల లిస్టు తయారు చేస్తున్నాడు. దయాళుబాబుకూడా అక్కడే కూర్చు

న్నాడు. ఆకవన్ను అన్నిటిమీద తన విలాసం వ్రాసి వుండుటా, రసమయి దస్తూరితో వుండుటా, చూచాడు. పోలీసు అధికారి అనుమతిగొని ఆకవరులను, వుత్తరములను దయాళుబాబు పరీక్షించిచూడ సాగాడు. దాదాపు ఇరవై వుత్తరములవరకు వున్నవి. అన్నీ వృందాసిరాతో, రసమయి దస్తూరితో వ్రాసి వున్నాయి. చాలా వుత్తరాలను తెరచిచూచాడు. దయాళు బాబు. అనేక పరిస్థితులను గురించి వూహించి వ్రాసి వున్నాయి. ఒకొక్కదానిలో "మర్రిచెట్టుమీద వున్నాననీ," ఒకదానిలో గయలో పిండప్రదానము చేశానని అనుకుంటున్నావేమో! ఇప్పటికి కూడా నేను నిన్ను బాధించగలను - నీ మెడవిరిచేస్తాను" అని వుంది. ఇంకొక దానిలో లగ్నం పెట్టుకున్నారని విన్నాను, ఇకనైనా జాగ్రత్తగావుండు, అనీ, మరొకదానిలో రేపు నీవివాహమట, ఇంతచెప్పినప్పటికీ వినిపించుకోలేదు. నీ యింటికి నిప్పంటించి, నిన్నూ నీ భార్యనూ చంపివేస్తాను అనీ. యీ విధంగా వున్నాయి.

జరిగిన విషయములన్నీ దయాళుబాబుకు చక్కగా బోధపడినవి.

దులారా తులసీకోటమీద కూర్చొని జరుగుచున్న విషయములను అన్నిటినీ చూస్తూవుంది. దయాళుబాబు ఆమె వంకచూచి "ఏమిటిది" అన్నాడు.

దులారమౌనంగా తులసిమాల అల్లాగే త్రిప్పుతూ కూర్చున్నది.

---

# మాతృహీనుడు

రెండవ పర్యాయంకూడా ఐ. సి. యస్. పరీక్షలో నేను ప్యాసు కాలేదని విన్నప్పుడు నాకు విచారం కలగలేదని చెప్ప జాలను. కాని ప్యాసైన పరీక్షార్థులలిస్టులో నాపేరు (శివనంద సహాయ్) వుండదని మొదటినుంచీ తెలుసును. దీనికి కారణం, సంవత్సరం పొడుగునా ఆట - పాటలలో నాకాలాన్ని వృధా చేయడమే. పరీక్షకు వెళ్ళకపూర్వమే నేను ప్యాసు కానే సంగతి నాకు తెలుసును. అందువల్ల పరీక్షకు వెళ్ళివచ్చిన తరువాత నాఅభిప్రాయాన్ని మార్చుకోవలసిన అవసరం ఏమీ కనిపించలేదు.

ఫెయిల్ అయానన్నమాట విని తలవంచుకుని సిగ్గుతో మానివాసస్థానానికి వచ్చాను. నవంబరునెల. పగలల్లా సూర్య భగవానుని చూచే భాగ్యం కలగలేదు. మధ్యమధ్య వానచినుకులు కూడా పడ్డాయి. లోపల, బయట-అంతా అంధకారమే. మాడేరాకు సమీపంలో 'ది ఆర్ట్ జియన్' అనే దుకాణం వుంది. అచ్చట మనోవ్యాకులతకు మందు లభిస్తుంది. ల్యాండ్ లేడిని పిలచి ఆమందు సీసా తెచ్చిపెట్టమన్నాను. ఆమందును సోడా నీళ్ళ అనుపానంతో కొంతవరకు పుచ్చుకున్నాను. త్రాగగానే నామనోవ్యాకులత మాయమయిపోయింది. ఒక నూతనోత్సాహం వుదయించింది. అదృష్టవంతుణ్ని కాబట్టే ఫెయిల్ అయాను లేకపోతే బారిష్టరీ చదువుదామనిపించేదే కాదు! ఒకసంవత్సరం పాటు కష్టపడ్డానంటే పరీక్ష ప్యాసవుతాను. బ్యారిష్టరీ ప్యాసయి

బాగా ధనార్జన చేసే యోగం వుండబట్టే ఐ. సి. యస్. లో తప్పాను. మానాన్నగారుకూడా బ్యారిష్టరీ ప్యాసై బాగా డబ్బు సంపాదించారు. నేనుకూడా అలా చేసి 'ఆతండ్రికి కొడుకును' అనిపించుకుంటాను.

ఈ ఆలోచన కలిగాక, నాతోపాటు చదివి పరీక్ష ప్యాసైన వాళ్ళమీద నాకు చాలా జాలి కలిగింది. వాళ్ళు ఎంతకష్టపడ్డా, నెలకు రెండు-మూడు వేలకంటే ఎక్కువ సంపాదించలేరు. ఒక పదిసంవత్సరాలు గడిచిపోయాక సుప్రసిద్ధ హైకోర్టు బ్యారిష్టరు శివనందన సహాయ్‌గారో ?—

ఆరోజు సాయంత్రం ఆనందంతోనూ,ఉత్సాహంతోనూ థియేటరుకు వెళ్ళాను, ఒక్కడనే.

షేక్స్పియరు వ్రాసిన ఒక చారిత్రాత్మక నాటకం ప్రదర్శింపబడ్డది. నాటకము చూచి ముగ్ధుణ్ణి అయ్యాను. రాత్రి పన్నెండుగంటలకు యింటికివచ్చి, పైన వివరించిన మందు ఒక మోతాదు పుచ్చుకొని పడుకోబోతున్నాను. షేక్స్పియరు నాటక రచనయందలి ఉత్తమోత్తమతను గురించి ఆలోచనకు రాగా కుర్చీలో కూర్చుని ఆలోచిస్తూంటే వెంటనే నిద్ర రాలేదు. భారతదేశంలో షేక్స్పియరు వంటి ఒక్కకవి కూడా లేడే-అని విచారం కలిగింది. ప్రయత్నం చేస్తే నేను భారత దేశానికి షేక్స్పియరును కాలేనా? ఎందుకు కాజాలను? హిందూదేశంలో వున్నప్పుడు అప్పుడప్పుడు హిందీలో పద్యములను రచించి పత్రికలకు పంపుతూవుండే వాడను. నారచనలను చదివి నామిత్రులంతా భవిష్యత్తులో ఉత్తమకవివి కాగల

వని చెప్పుతూండేవారు. నాలో ఒక మహత్తరమైన శక్తి వున్నది. దానిని జాగరిత మొనర్చిన యెడల భవిష్యత్తులో భారతదేశమునకు షేక్స్పియరువంటి కవిని కాగలను - ఎప్పటి వరకో ఎందుకు? రేపె ఒక చారిత్రక నాటకమును రచించుటకు ప్రారంభించెదను - అనుకుంటూ పడుకున్నాను. వెంటనే నిద్రపట్టింది.

## 2

మరునాడు ఉదయం తొమ్మిది గంటలకు నిద్రనుంచి లేచి చూచేటప్పటికే - మంచుపడుతూ వుంది. పెందలకడనే ప్రాతఃకాల భోజనమును పూర్తిచేసుకుని అమంచులోనే ఉత్సాహంతో బయటకు బయలుదేరాను బండిమీద బ్రిటిష్ మ్యూజియముకు పోతిని. ఒక షిల్లింగు పెట్టి బైండుచేసిన తెల్ల కాగితములపుస్తకమునుకొన్నాను. రాత్రి నిర్ణయించుకున్నట్లు నారచనలు ప్రారంభించేందుకు.

ప్రపంచ చిత్రములలో ఎనిమిదవదిగా బ్రిటిష్ మ్యూజియమును చెప్పవచ్చును. అన్ని కులములందలి - అన్నిజాతులకు సంబంధించిన విషయములూ అచ్చట లభించగలవు. ఈ బ్రహ్మాండమైన పఠనాలయపు క్రిందిభాగం చంద్రాకారంగా వుంటుంది. మధ్యకొంతస్థలం మ్యూజియం వుద్యోగులుకూర్చొనుటకు ప్రత్యేకింపబడింది. అచ్చట గుండ్రగా మూడువరుసలమరలు వుంటవి. వాటిలో పుస్తకముల జాబితాలు వుండును. ఒక్కొక్క జాబితాకు వెయ్యికిపైగా భాగములు వుంటవి.

ఈ జాబితాలు అకారాది క్రమముగను - గ్రంథకర్తల పేర్లు గ్రంథవిషయము ననుసరించి - తయారు చేయబడును. వీటి తరువాత నర్ధచంద్రాగారముగ లెక్కడ రానన్ని టేబులులు అమర్చబడి యున్నవి. ఒక్కొక్క టేబులుపై చాలా మంది పాఠకులు కూర్చొని చదువుకొన వచ్చును. ప్రతి టేబులుపైన నంబరులు వేసియుండును.

ఈ పఠనాలయము ఉదయం ఎనిమిది గంటలనుంచి సాయంత్రం ఎనిమిది గంటలవరకు తెరచివుంటుంది. లోపలికి వెళ్ళి చూచాను. అప్పటికి యింకా ఎక్కువమంది పాఠకులు రాలేదు. నేను కుర్చీలో కూర్చుని, జాబితాను చూచి, రాజపుత్రుల చరిత్రకు సంబంధించిన రెండుపుస్తకముల పేర్లువ్రాసిఇచ్చాను. పది నిముసములలో ఒక ఉద్యోగి ఆరెండుపుస్తకములను తెచ్చి యిచ్చెను.

ఆచరిత్రలను పుచ్చుకొని, నా రచనకు పనికివచ్చు విషయమునకై వెతుక సాగితిని. నాయకుడుగా వుండుటకు ఒక రాజు కావలెను. ఆరాజు కొద్దిసేనతో ఒకటిరెండు పెద్ద పెద్ద యుద్ధములలో జయము పొందినవాడుగా వుండవలెను. ఆ యుద్ధము తనదేశము కొరకైనను లేదా తన రాజ్య రక్షణార్థమైనను - యిబ్బందిలేదు. యుద్ధ సమయమున అతనినోట దేశభక్తిని గురించి ఉపన్యసింపజేతును. రాజకు బదులు రాజపుత్రుడైతే యింకనూ ప్రయోజనీయము ఎందుకన, రాజులలో సాధారణముగా అవివాహితులు దొరకరు, అందువల్ల రాజును ప్రేమపాశములలో చిక్కబడునటుల చేసే అవకాశాలు ఎక్కు

వగా వుండవు. నాయకుడు ప్రేమించు యువతిపేరు మధురగాగను, కోమలముగను వుండవలెను. పేరు ఆకర్షణీయము వుంటే, ఆమె పాటకురాలు కాకపోయి నప్పటికీ, గుఱ్ఱపుస్వారిలో నైపుణ్యం కలది కాకపోయినప్పటికీ ఫరవాలేదు. ఏదోవిధంగా ఆలోటును పూర్తి చెయ్యవచ్చును.

ఒక గంటకు పైగా పైలక్షణములతో కూడిన నాయకీ-నాయకులను అన్వేషించుటలో వ్యర్థపుచ్చిన తరువాత, ఒక వృద్ధ ఆంగ్లవనిత తలయంతయు నెరసినది, మెల్ల మెల్లగా అడుగులు వేయుచూ పఠనాలయములోనికి వచ్చుచుండెను. ఆమె చేత ఒక నల్లటి తోలుసంచి వున్నది. అలాటి తోలుసంచిలో సాధారణంగా చిత్రకారులు ఫొటో తీయుటకు కావలసిన వస్తువులను పెట్టి వుంచుతారు. ఆమె నావద్దకు వచ్చి నా ముఖమువైపుచూచి, తెల్లబోయి నుంచున్నది. వెంటనే సంబాళించుకుని, ఏమీ ఎరుగని దానివలె నేను కూర్చున్న కుర్చీకి నాలుగయిదు కుర్చీలకు అవతల కూర్చున్నది.

ఆమె పరిస్థితిని చూచి ఆమెకు దృష్టి లోపం వుందని తెలిసింది. మొదట దూరమునుంచి చూచి ఎవరో పరిచిత వ్యక్తి కాకపోవుచే అటుల నిశ్చేష్ఠపోయి యుండును. ఈ విషయం నా మనస్సులో ఎక్కువసేపటివరకు వుండలేదు. అందుచే వెంటనే కథానాయకునికై చరిత్రను వెదుకసాగాను. ఈవిధంగా మరికొంతకాలం గడిచింది. నాకు నచ్చిన కథానాయకుడు ఆ పుస్తకములలో దొరకనందునవల్ల, మరి రెండు పుస్తకములు తెచ్చుకొనుటకై బయలుదేరితిని. పోవునప్పుడు ఆమెకు దగ్గ

ఆగా పోవలసి ఉండెను. అటులపోవునప్పుడు ఆమె ముందు రెండు మూడు హిందూదేశ చిత్రపటముల పుస్తకములు తెరచి యుండటం, ఆమె కాగితముపై పెనసలుతో అరణ్య దృశ్యమును గీస్తూండటం తిరిగి, వచ్చేప్పుడు చూడగా ఆ అడవిలో ఒక పెద్దపులి దాగియుండటం? ఏనుగుపై కూర్చున్న సైనిక వేషధారియగు ఒక ఆంగ్లేయుడు ఆ పులిని చంపుటకై తుపాకితో గురి చూచుచుండటం కనిపించింది.

ఒంటిగంట అయింది. లంచికసమయం కావచ్చింది. పుస్తకమును యథాస్థానంలో పెట్టి బయటకు వచ్చాను. దగ్గరలోనే వున్న వియన్న రెస్టోరెంటుకు వెళ్ళి భోజనమునకు కూర్చున్నాను.

ఒకటి, రెండు నిముషములు అయిన తరువాత ఆమె కూడా యీ హోటలుకే వచ్చి, నాకు ఎదురుగావున్న కుర్చీలో కూర్చుంది. నావైపు చూచి చిరునవ్వుతో 'good after noon, ఇంతకుముందు మీరు బ్రిటిష్ మ్యూజియం రీడింగ్ రూములో వున్నారు కాదూ ?' అంది.

"అవును, మీకు కొద్దిదూరంలో కూర్చుని వున్నాను" అని నమస్కారము చేశాను.

"క్షమించండి. మీరు హిందూదేశంనుంచి వచ్చారా ?"

"మరే. బ్రాహ్మలం"

"ఎక్కడ వుంటారు?"

"సెంట్రల్ ప్రావిన్సులో ఒక గ్రామంలోవుంది. మా యిల్లు. కాని చాలాకాలంనుంచి మా తాత, తండ్రులు బొంబా

యిలోనే వుంటున్నారు. ఇప్పుడు బొంబాయియే మాస్వగ్రామం”

“నేను యిలా అడిగినందుకు మీకు కష్టం కలిగించదేమో! పూరికే తెలుసుకుందామనే వుద్దేశ్యంతో అడగలేదు.”

“ఏం ఫరవాలేదు. అడగండి.”

“పంజాబుకు గాని యుక్త ప్రాంతానికిగాని ఎప్పుడైన వెళ్ళారా ?”

“యుక్తప్రాంతానికి ఎప్పుడూ వెళ్ళలేదు కాని, పంజాబులో చాలా పట్టణాలను చూచాను.”

ఇంతలో హోటలు నౌకరు ఆమెకు ఏమి కావాలో అడగటానికి వచ్చాడు.

క్షణంసేపులో తనకు కావలసిన ఆహారపదార్థముల పేర్లు చెప్పి తెచ్చిపెట్టవలసిందిగా చెప్పింది తరువాత నాతో క్షమించండి. చొరవగా అడుగుతున్నాను. నేను చాలా మాసపత్రికలకు చిత్రపటాలను రాస్తూవుంటాను. అందులో భారతదేశమునకు సంబంధించినవి ఎక్కువగా వుంటాయి. ఈమధ్యనే, ఒక పత్రికా సంపాదకుడు హిందూదేశమందలి వేటకు సంబంధించిన కథకు చిత్రపటములను గీయవలసినదిగా పంపినాడు అందలి కథాభాగము యిది : పంజాబునందలి ఒకరాజు, ఒక బ్రిటిష్ సైనికుడు, యిద్దరూ ఒకే ఏనుగుపై కూర్చుని అడవికి వేటాడుటకు వెళ్ళిరి. దూరమునుంచి పులి గర్జనను విని రాజు భయపడి ఏనుగును దిగి పారిపోయెను. బ్రిటిష్ సైనికుడు ఆ శబ్దమును గురిగా పెట్టుకుని అడవిలో దాగి పులిపై తుపాకిని కాల్చెను. ఈ కథకుగాను రెండు చిత్రములను గీయవలసి

వున్నది. ఒకటి, రాజు పారిపోవుచున్న చిత్రము. రెండవది బ్రిటిష్ సిపాయి పులిపై తుపాకి పేల్చుచున్న చిత్రము. వీటిలో రెండవ చిత్రాన్ని గీస్తున్నాను. కాని మొదటి చిత్రాన్ని గురించి సందేహంలో వున్నాను. భారతదేశపు రాజులు దర్బారు మొదలగు సమయములలో ధరించే దుస్తులనే తెలియ జేయు చిత్రములు కనిపించుచున్నవి. కాని వేటాడు సమయమున ధరించు దుస్తులను గురించిన చిత్రపటములు లభించలేదు. వేటాడునప్పుడుకూడా అవే దుస్తులను ధరింతురా? లేక అందుకు ప్రత్యేకమగు దుస్తులు గలవా? అనే సందేహంతో వున్నాను.

ఈ కథను వినేప్పటికే నాకు ఎంతో ఆవేశం వచ్చింది. దానిని శక్తికొలది అణచుకొని "దొరసానిగారూ, పులిగర్జనను విని రాజు ఎందుకు పారిపోయాడు? బ్రిటిష్ సైనికుడు పారి పోవుట, రాజు దానిని చంపుట సమంజసముగా వుండును గదా!" అంటిని.

నాయీమాటలనువిని ఆమె మందహాసముచేసి "మీరు పొరపడుతున్నారు. నేను కథను వ్రాయుటలేదు. వ్రాసిన కథకు చిత్రములను మాత్రమే గీయుచున్నాను" అన్నది.

"నిజమే. నేను పొరపడ్డాను. నా దేశీయుని నిందించుటను వినగానే నాకు చాలా ఆవేశము కలిగి అలా అన్నాను. క్షమించండి.

"మీకుగల దేశభక్తికి నాకు చాలా సంతోషం కలిగింది. నా ప్రశ్నకు జవాబుచెప్పండి!

"మీ ప్రశ్నకు జవాబు చెప్పుట చాలా కష్టము. నేను ఒకరిద్దరు రాజులను చూచాను. కాని, బొంబాయి వీధులలో పోవునప్పుడూ, రైలు ప్రయాణము చేయునప్పుడూ చూచాను. వేటాడునప్పుడు చూడలేదు."

"రేపు మళ్ళా ఒకసారి చిత్రపటములతో వున్న పుస్తకములను పరీక్షించి చూస్తాను. వాటిలో దొరుకవచ్చును" అని కొంతసేపు ఆలోచించి అన్నది.

ఆ తరువాత యింకేవో విషయములను గురించి మాట్లాడుకొంటిమి. నన్ను గురించికూడా ఆమె సంశోయిస్తూ అడిగింది. చివరకు తన (విజిటింగ్ కార్డు ఒకటి యిచ్చి మా యిల్లు దగ్గరలోనే వుంది. తీరిక వున్నప్పుడు ఎప్పుడైనా వస్తే, నేను గీసిన రేఖా చిత్రములను చూదురుగాని" అన్నది.

ఆమె ఆహ్వానించినందుకు ఆనందాన్ని వెలిబుచ్చుచూ, నా విజిటింగ్ కార్డును కూడా ఆమెకు యిచ్చాను. నా పేరును చూచి ఆమె 'పారక్' బొంబాయిలో గల విఖ్యాత బ్యారిష్టర్ మీకేమైనా బంధువా? అని ప్రశ్నించింది.

నాతండ్రికీర్తి యింతదూరమువరకు వ్యాపించుటను విని గర్వించితిని. ఆనందముతో 'అవును. వారు మాతండ్రి. మీకు ఎలా తెలుసును?' అని అడిగాను.

'పత్రికలలో చూచాను. ప్రస్తుత భారతదేశ పరిస్థితులను గురించిన వాస్తవ విషయాలను తెలుసుకొనుటకు అప్పుడప్పుడు యిండియా ఆఫీసు లైబ్రరీకి వెళ్ళి బొంబాయి - కలకత్తా మొదలగు స్థలాలనుంచి వచ్చే వార్తాపత్రికలు చదు-

వుతూవుంటాను. 'అబ్బ' యివ్వాళ హోటలు ఎంత క్రిక్కిరిసి వుంది! విపరీతంగా ఉక్కపోస్తోంది... సరే వెడతాను.

## 3

ఆపిమ్మట రెండురోజులవరకు ఆమె బ్రిటిషు మ్యూజియములో కనిపించలేదు. ఈరెండు రోజులలోను నాటకమును రచించుటకు కావలసిన కథాభాగమును నిర్ణయించుకుని, నాటకమును వ్రాయ మొదలుపెట్టాను.

మూడవనాడు రాజపుత్రచరిత్రకు సంబంధించిన యితర పుస్తకముల కొరకు పుస్తకముల జాబితాను చూస్తూవున్నాను. ఇంతలో ఆమె (మిస్. క్యాంబెల్) నాప్రక్కగా వచ్చి నుంచున్నది. మందహాసంచేసి కరస్పర్శకై చేతి నందించినది. నేను కూడ చేతినిజాపి కరస్పర్శ చేసి, కుశలప్రశ్నలను అడిగిన తరువాత ఆమె కోమల స్వరముతో 'రాజపుత్ర చరిత్రకోసం చూస్తున్నట్టున్నారు? అంది

బ్రిటిష్ మ్యూజియంలో బిగ్గరగా మాట్లాడరాదు.

"మీకూ యీభాగమే కావాలా? ఇదిగో తీసికొనండి. మీరు చూచిన తరువాతనే నేను చూస్తాను".

"ఎందుకు? ఇద్దరమూ కలసి చూద్దాము. రాజుల వేటకుక్కల కోసం చూడాలి. మీరు దేనికొరకు వెతుకుతున్నారు?

"రాజపుత్ర చరిత్రను ఆధారంగాతీసికొని నాటకం రాస్తున్నాను."

"ఏమిటి! మీరు నాటక రచయితలా?"

"నాటకకర్తను కాను. కాని ప్రయత్నం చేస్తున్నాను."

"బాగుబాగు. ఒక రోజున మీ ప్లాటు వింటాను."

"చాలా సంతోషం" అని ఆమెకు కొన్ని పుస్తకములు తీసి యిచ్చితిని ఇద్దరమూ ఎవరిస్థానములో వారము కూర్చుంటిమి

నేను ప్రతిరోజూ అక్కడకుపోయి నాటకం వ్రాయసాగితిని. క్యాంబెల్ కన్య కూడా ప్రతిరోజూ వస్తూవుంది. కాని, మరెన్నడూ ఆమె ఆహోటలుకు వెళ్ళగా చూడలేదు. ఆమె లంచ్‌కి యింటికే వెళ్ళి వస్తున్నట్టుంది.

"ఇవ్వాళ మూడవ ఝాము వేళ మీ యింటికి చిత్రపటాలు చూచేందుకు రానా?" అని ఒకరోజున ఆమె వద్దకు పోయి చెవిలో అడిగాను.

ఆమె చాలాసంతోషించి "అలాగే, తప్పకరండి. ఇవ్వాళ టీకి మాయింటికే రండి. నాతోపాటుతీసుకువెడతాను" అంది.

"నమస్కారములు" అని నాకుర్చీలో కూర్చుని నాపని చూచుకుంటున్నాను.

"పదండి, పోదాము" అని మూడుగంటలకు వచ్చి ఆమె అన్నది.

నా వద్దవున్న పుస్తకాలన్నీ లైబ్రరీలో యిచ్చేసి నా వ్రాత ప్రతిని తీసుకుని ఆమె యింటికి వెళ్ళాను. ఆమె బ్లూమ్స్‌బరీ మేన్షన్సు అనే ఒక పెద్దమేడలో ఒక భాగంలో ఒక గదిలో ఆమె చిత్రశాల(Stndio)వుంది. నన్ను అక్కడకు తీసుకుపోయి కూర్చోబెట్టింది.

"అయిదు నిమిషాలలోగా టీతీసుకురమ్మని చెప్పివస్తాను. ఈలోగా గోడకు తగిలించిన చిత్రాలను చూస్తూ వుండండి" అంది.

నేను ఆ చిత్రాలను చూస్తూవున్నాను. వాటిలో ఎక్కువభాగము ప్రకృతికి సంబంధించినవే. చెట్లతో చుట్టి వేయబడియున్న సరస్సులు, వేగముగా పారుచున్న నదులు, తెల్లని యిసుక రేణువులతో నున్న నదీతీరములు మొదలైన ప్రాకృతిక దృశ్యములు అతిమనోహరంగాఉన్నాయి. వాటిలో ఒకటి రెండు తైలచిత్రాలు కూడా వున్నవి.

కొద్ది సేపటిలోనే మిస్. క్యాంబెలు వచ్చేసింది. ఒకటి తరువాత ఒకటిగా ప్రతి చిత్రాన్ని చూపించి వాటిని గురించి చెబుతూ చివరకు"ఇవన్నీ నేనుఉత్సాహంకొద్దీ వేసినచిత్రాలు. శిల్పకళాభ్యాసం కోసం గీశాను. ఇదిగో! ఇవన్నీ పొట్ట పోసి కొనుటకు వృత్తిగా గీసిన చిత్రాలు —పారిపోవుచున్న రాజు మొదలైనవి" అంది.

ఆతరువాత ఒకపెద్ద పోర్టుఫోలియో తీసింది.

నేను — ఆచిత్రింకోసం ఏంచేశారు?

'దర్బారు దుస్తులతోనే చిత్రాన్ని గీశాను. సంపాదకుడి వద్దకు వెళ్ళి నాసందేహాన్ని గురించి అడిగాను. దానికి అతడు' మాసపత్రికలో గీసే చిత్రాల విషయంలో యింత సూక్ష్మ దృష్టి అవసరంలేదు. రాజును బాగా లావుగా చిత్రించి దర్బారు దుస్తులు వెయ్యండి. లేకపోతే రాజు, అని తెలుసుకుందుకు వీల్లేదు. "అన్నాడు. అందుకని అలా గీశాను."

పోర్టు ఫోలియోలో వున్న చిత్రాలలో ఎక్కువభాగం కథలు, నవలలకు సంబంధించినవే. వాటిని చూస్తూ వుండగానే టీ తయారైనదని కబురు వచ్చింది. మిస్ క్యాంబెల్ నన్ను డ్రాయింగ్ రూమ్‌లోకి తీసుకుని వెళ్ళింది.

టీ త్రాగుతూ కూడా ఏవో సంగతులు మాట్లాడుకుంటూ కూచున్నాము. ఆకస్మికంగా ఆమె నా నాటకపు ప్రతిని తీసి పుచ్చుకొని "ఇదేనా మీ నాటకం ?" అంది

"అవును"

"ఎంతవరకు వచ్చింది"

"మూడవ అంకంరాస్తున్నాను. ఇంకా రెండుఅంకాలు రాయాలి".

"కథ చదవండి."

నేను కథాభాగాన్ని వినపించసాగితిని. అచ్చటచ్చట కొద్దిగా సవరణలు చెయ్యవలసినదిగా ఆమె సలహా యిచ్చింది. ఆమె చెప్పిన సలహాలు చాలా ఉపయుక్తమైనవిగా కనిపించాయి

"మీ రచనను చదివే అదృష్టం నాకు లేదు. ఒకప్పుడు హిందీ నేర్చుకునేందుకు మొదలుపెట్టాను" అని చివరకు ఆమె అన్నది.

"హిందీనా ? ఎంతవరకు నేర్చుకున్నారు ?" అని నేను ఆశ్చర్యంతో అడిగాను.

"కొద్దిగా"

"ఏమైనా గుర్తుందా ?"

లేదు. చాలా కాలమయింది. కల్లూ మున్నూ అనే యిద్దరు పిల్లలకథ చదివినట్టు గుర్తుంది. అందులో మున్నూ అంటే నాకు యిష్టంగా వుండేది. కల్లూఅంటే ఒకటే రోత. goody goody అంటూ వుండేవాళ్ళం.''

నాకు నవ్వు వచ్చింది. ఆమెకుగల జ్ఞాపకశక్తికి ఆశ్చర్య పడి "మళ్ళా ప్రయత్నంచేస్తే, కొద్దిరోజుల్లో మంచి విజ్ఞానాన్ని సంపాదించ వచ్చును" అన్నాను.

"ఈ వయస్సులో నేర్చుకుని చేసేదేమిటి ? హిందీ నేర్చుకున్నప్పుడు నా వయస్సు యిరవై సంవత్సరా లుండేది" అని మిస్ క్యాంబెలు మరొకవైపు చూడసాగింది.

ఆసమయాన పగటి వెలుతురు పూర్తిగా తగ్గిపోయింది. అందువల్ల ఆమె ముఖమును సరిగా చూడజాలకపోతిని. అయి నప్పటికీ ఆమె కనులు కన్నీటితో నిండివున్నట్టు కనిపించాయి. ఆమె ధ్యానమును మరొకవైపు మరల్చదలచి "ఇంకొక కప్పు టీ తెప్పిస్తారా ?'' అని అన్నాను.

"ఆమె తొట్రుపడుతూ" క్షమించండి. మీ పాత్రలో టీ అయిపోయిందనే ధ్యాసే లేకపోయింది.''

అని నవ్వుతూ పాత్రలో టీ పోసి "చారిత్రకనాటకా లేనా, సాంఘికనాటకాలు రాయాలనే అభిలాషకూడా వుందా ?'' అంది.

"క్రమక్రమంగా సాంఘిక నాటకాలుకూడా రాయాలని వుంది.''

"అయితే, నేనొక ప్లాటు చెబుతాను. నిజమైనది. హృదయవేదన కలిగించే ప్రణయగాథ.

"చాలా సంతోషం. చెప్పండి"

"ముందు యీ నాటకాన్ని పూర్తిచేయ్యండి. తరువాత చెబుతాను."

మరి పదినిముషములవరకు మాట్లాడుతునే వున్నాము. రాను రాను చీకటి దట్టం కాసాగింది. దాసీది వచ్చి లైటువేసి వెళ్ళిపోయింది.

అప్పుడు నేను యింటికి బయలుదేరాను. ఆమె సింహద్వారం వరకు సాగనంపుటకై వచ్చి "మీ నాటకం పూర్తి అయాక, వకరోజువచ్చి అనువాదం చేసి వినిపించండి. మరచి పోకండి." అంది.

"ఆ, తప్పకుండానూ" అని నేను వెళ్ళిపోయాను.

## 4

నేను వ్రాస్తున్న నాటకం పూర్తి అయింది. మ్యాజియంలో యీవార్త క్యాంబెల్‌కు చెప్పాను. ఆమెకూ నాకూ మైత్రి యింకా ఎక్కువ అయింది. ఆ తరువాత మరిరెండు పర్యాయాలు ఆమె యింటికి వెళ్ళి టీ త్రాగానుకూడా. ఆమె ప్రవర్తన, సంభాషణలను బట్టి చూడగా, ఆమెకు నామీద హృదయ పూర్వకమైన ప్రేమ వున్నట్టు కనిపించింది.

ఒకనాడు బ్రిటిష్ మ్యూజియంలో యిద్దరమూ కలుసుకున్నప్పుడు "రేపు నాకు ఏపనీ లేదు. నాటకం వినిపిస్తారా?" అంది ఆమె.

"అలాగే. ఎప్పుడు రమ్మంటారు?"

"రేపు యిక్కడకు వస్తారా?"

"ఆఁ వస్తాను."

"అయితే, నాటకం తీసుకురండి. ఒంటిగంటకు యిక్కడి నుంచి లంచికి మాయింటికి వెళ్ళుదాము.

"తప్పకుండా. అలాగే, ఒక వేళ రేపు యిక్కడకు రాని పక్షాన్ని, సరాసరి ఒంటిగంటకు మీయింటికే వస్తానులెండి."

అది డిశెంబరు నెల విపరీతమైన చలి. ప్రతిరోజూ ఉదయాన మంచుపడుతూ వుంది. ఆరోజున ప్రొద్దున్నే లేచేప్పటికే వాన కురుస్తూవుంది.

నా ప్రాతఃకాల భోజనం పూర్తి అయ్యేప్పటికి తొమ్మిది గంటలయింది. ఇంకా వాన తగ్గలేదు. పది అయింది. అప్పటికీ తగ్గలేదు. మా ల్యాండులేడీ చెప్పిన 'Rain before Seven, Clear before eleven' అన్నమాట జ్ఞప్తికివస్తే పదకొండు గంటలకు వాన వెలుస్తుందని నిశ్చయించుకున్నాను. అదేమి చిత్రమోగాని, ఆమె భవిష్య ద్వాణికి ప్రతివాదంగానా అన్నట్టు పదకొండు గంటలకు వాన తగ్గకపోగా యింకా ఎక్కువయింది. పన్నెండు అయింది; అప్పటికికూడా అలాగే కురుస్తూ వుంది ఇంకొకప్పుడైతే యీ పరిస్థితిలో బయటకు కదిలేవాణ్ణికాను. మొట్టమొదటి పర్యాయంగా నా రచనను వినా

లనే ఉత్సాహంగల రసికశ్రోత లభించినప్పుడు వెళ్ళకపోతే ఎలా?...వెంటనే బండిని పిలిచి బయలుదేరాను.

నన్ను చూచి మిస్.క్యాంబెల్ 'How very Sweet of you to come in this weather! బూటు తడిసిపోయినట్టుందే?' అంది.

"అబ్బే, ఎక్కువగా తడవలేదు. మ్యూజియంకు వెళ్ళకుండానే, బండిమీద యిక్కడకు వచ్చాను. బండి ఎక్కేటప్పుడూ దిగేటప్పుడూ కొద్దిగా తడిసివుంటుంది."

నామాట మీద ఆమెకు నమ్మకం కలగలేదు. వంగి నా బూటునుచూచి "బాగా తడిసింది, విప్పెయ్యండి" అంది.

స్త్రీ ఎదుట బూటు విప్పటం అనేమాట వినేప్పటికే నా వొళ్ళు గగుర్పొడిచింది. ఆమె నేను సంశయిస్తున్నానని కనిపెట్టి 'Silly boy' ఎందుకు అంత గాభరా పడతావు? ఒక్కొక్కప్పుడు నియమాలనుకూడా నతిక్రమించవలసిన సమయాలు వస్తాయి. విడువు. ఆరోగ్యం చెడుతుంది" అంది.

"ఎక్కువగా తడవలేదు. నిప్పుదగ్గర కొద్దిసేపు కూచునేప్పటికే ఆరిపోతాయి" అని సిగ్గుపడుతూ జవాబిచ్చాను.

"కొద్దిగా కాదు. బాగా తడిశాయి. మేజోళ్ళవరకు యీ తడిపోయివుంటుంది. మేజోళ్ళు కూడా తడిస్తే కష్టం. బూటువిడిచి నిప్పు దగ్గరగా పెట్టు. లంచికి యింకొంచెం ఆలశ్యం వుంది. వంటమువిసి. వచ్చేప్పటికే ఆరిపోతాయి."

నేను తప్పించుకోవాలని చూస్తున్నానని కనిపెట్టి "అంత సిగ్గయితే చెప్పు, నేకే గదిలోకి వెడతాను. నీ బూటు ఆరి

పోయేవరకూ రాను. మీ అమ్మ బ్రతికివుండి యిలాంటప్పుడు పిప్పమంటే విప్పవూ? నన్ను నీ తల్లిగా ఎందుకు భావించ రాదు. అని అన్నది.

ఆమె మాటలకు ఎదురు చెప్పలేక ఆమె ఎదుటనే బూటు విప్పాను.

మే మిద్దరమూ నిప్పుదగ్గర కూచుని అనేక సంగతు లను గురించి మాట్లాడుకోసాగాము. ఒకటిన్నర అయింది, అప్పటికి నా బూటుజత కూడా ఆరిపోయింది. బూట్లు తొడు క్కున్నాను,

మిస్. క్యాంబెల్ వంటమనిషితో వంటకాలను తీసుకు రమ్మని చెప్పి కొద్దిసేపటిలోనే నన్ను భోజనాలగదిలోకి తీసుకు పోయింది. మాటలు చెప్పుకుంటూ వుండగానే భోజనం చెయ్యటం పూర్తిఅయింది. దాసీదివచ్చి టేబులును శుభ్రం చేసింది. ఆగదిలోనే కూచుని నాటకంవినిపించసాగాను. కొన్ని దృశ్యాలలో వుండే కథాభాగాన్ని నోటితోనే చెప్పాను. ఉత్తమభావాలతో రచించాననే అభిప్రాయంగల భాగాలను మాత్రం అనువాదంచేసి వినిపించాను. ఆమె నాటకము విని చాలా బాగుందని ప్రశంసించింది.

నాలుగు గంటలయింది టీ త్రాగాను, ఇప్పటికి కూడా కొద్దిగా వర్షం కురుస్తూనేవుంది. ఆకాశం అంతా మబ్బులతో నిండివుంది.

"నాకు సాంఘిక నాటకం రచించేందుకు ప్లాటు చెప్తా నన్నారు. చెబుతారా?" అన్నాను.

"చెబుతాను. డ్రాయింగ్ రూములోకి పద, చెబుతాను. ఈ గదిలో వెలుతురు తక్కువగా వుంది."

మేము యిద్దరమూ డ్రాయింగ్ రూములోకి వెళ్ళాము. అప్పటికి ఇంకా చలివేస్తూనే వుంది. నాలుగువైపులా చలిరాకుండా తలుపులు అన్నీ వేసివుంచినప్పటికీ, విపరీతమైన చలిగానేవుంది. దాసీదివచ్చి చలికాచుకునేందుకు బొగ్గులువేసి కుంపటి రాజేసింది.

మిస్ క్యాంబెల్ శాలువా కప్పుకుని తానుచెబుతానన్న కథను యీవిధంగా ప్రారంభించింది.

"ఈ లండనుకు పరిసర గ్రామంలో (నీనాటకంలో హెన్రీ స్మిత్ అనిగాని రిచ్మండ్ అనిగాని రాయవచ్చును) ఒక సాధారణ గృహస్థు వున్నాడు. ఆయనకు ఒక కొడుకు యిద్దరుకూతుళ్ళూ వున్నారు. కొడుకు వయస్సు ఇరవయ్యొక్క సంవత్సరాలు వుంటుంది. అతడికి ఏంపేరు పెడతావు? జార్జి అంటావా ఫ్రెడరిక్ అంటావా? ఎందుకులే. ఫ్రెడరిక్ అంటేనే బాగుంటుంది. ఫ్రెడరిక్కు చిన్న పేరుగా ఫ్రెడ్ అని వ్రాయి. ఇద్దరుకూతుళ్ళలోనూ పెద్ద పిల్లపేరు ఎలిజబెత్ అనిగాని లిజీ అనిగాని అనుకో. ఈమెయే కథానాయకి. పేరు పూర్వకాలపుది. బాగుండలేదా? బాగుండకపోతే మాడ్‌గాని గ్లాడిస్ అనిగాని మార్చు. చిన్న కూతురుపేరు క్యాథరిన్. అప్పా-చెల్లెళ్ళు యిద్దరకూ రెండు సంవత్సరాలు తేడా.

"పెద్దకూతురుకు చదువుకోటం అంటే ఎక్కువప్రీతి. ఆమె ఫ్రెంచి, జర్మన్, ఇటాలియన్ భాషలు బాగా నేర్చు

కున్నది. విక్టర్‌హ్యూగో, గేటే దాంతేల, మూలగ్రంథాల్ని బాగా చదవగలదు. గ్రీక్‌భాషను కూడా నేర్చుకున్నది. అసమయంలో కేంబ్రిడ్జినుంచి ఫ్రెడ్ తనతల్లికి ఒక వుత్తరం రాశాడు. తనతో చదువుకుంటున్న ఒక హిందూమిత్రుడు వున్నాడనీ, సెలవులు నెలాపదిహేను రోజులూ మన యింట్లో వుంచుకుందామని వున్నదనీ రాశాడు. తల్లి సంతోషంతో సమ్మతించింది. ఫలానా తేదీనాటికి వస్తున్నామని ఫ్రెడ్ వుత్తరం రాశాడు,

"కాని మ్యాడీకు యీవార్త చాలా విచారాన్ని కలిగించింది. ఆమె తల్లిదండ్రులతో, హిందువుడితో యీయింట్లో ఎలా వుండను?" అన్నది. వారు ఎంతోనచ్చ జెప్పారు. కాని మ్యాడ్‌కు యిష్టం కాలేదు. అన్న రేపు మిత్రుడితో వస్తాడనగా ఒకరోజు ముందుగానే పింతల్లిగారి యింటికి లండన్ వెళ్ళిపోయింది.

"రెండు-మూడు రోజులు గడిచాక, ఫ్రెడ్ తన స్నేహితుణ్ణి వెంటబెట్టుకుని, పినతల్లినీ, మ్యాడ్‌నూ తీసుకువచ్చేందుకు లండన్‌కు వెళ్ళాడు. హిందువుడి నెత్తిమీద నెమలిఈకటోపీ, మొగముకురంగు, చేత విల్లుఅమ్ములు, ఎలుగుబంటి చర్మపుదుస్తులు లేకపోవటాన్ని చూచేప్పటికి మ్యాడ్‌కు ధైర్యంవచ్చింది. హిందువులపట్ల తనకున్న భావాన్ని మార్చుకొని యింటికి వచ్చింది.

"క్రమక్రమంగా మ్యాడ్‌కు —"

నేను మధ్యలో అడ్డువచ్చి కథానాయకుడిపేరు ఏమని పెట్టను? అన్నాను.

"అతడు హిందువుడు. హిందువుల పేరు ఏవిధంగా వుంటే బాగుంటుందో, ఆపేరు పెట్టు.

నేను ఆలోచించి 'రఘునందన్' అన్నాను.

"బాగుంది. క్రమంగా మ్యాడ్‌కు రఘునందనుడు సంస్కృతం వచ్చునని తెలిసింది. తల్లి దగ్గరకు వెళ్ళి 'సంస్కృతం నేర్చుకుంటాను' అని అడిగింది. ఆమాట మీద రఘునందనుడు నాకు ఫ్రెంచి నేర్చుకోవాలని వుంది. నాకు ఫ్రెంచి నేర్పండి. నేను మీకు సంస్కృతం నేర్పుతాను అన్నాడు.

ఈవిధంగా ఒకరికి మరొకరు శిష్యులు అయ్యారు. అది మే నెల. ఆకాశము పరిశుభ్రముగనీలవర్ణముతో వుంది. ఇంటి వెనుక వున్న చెమను, వాటర్ కప్, క్రీమ్‌రోజ్ మొదలైన పుష్పాలతో నిండి వుంది. చెమను మధ్య లైలాక్ చెట్టువుంది. దానినిండా అంతు లేనన్ని పూలున్నాయి. ఇంట్లో చాలా వెచ్చగా వుంటున్నదువల్ల, యిద్దరూ ఒక టేబులు, రెండు తేలికగావుండే కుర్చీలూ తీసుకు వెళ్ళి ఆచెట్టుక్రింద ఉదయం, సాయంత్రం కూర్చుని చదువు కుంటూ వుండేవారు. ఆచెట్టుకొమ్మమీద ఆకులచాటున కూర్చుని ఒక పక్షులజంట పగలల్లా ప్రేమగీతాలను పాడుతూ వుండేవి. క్రమక్రమంగా వీరి మనస్సులలో ఒకరిపై మరొకరికి అనురాగబీజాలు మొలకలెత్తసాగాయి.

"మ్యాడ్ తల్లి-దండ్రులకు యీసంగతి ఏమాత్రం తెలి యదు. కాని ఫ్రెడ్‌కు తెలుసును. అతడు చెల్లెళ్ళు యిద్దరినీ తీసుకుని ఒక్కొకప్పుడు రిచ్‌మండ్ పార్కుకు, ఒక్కొక్కప్పుడు క్యూ గార్డెన్స్‌కూ షికారుకు వెడుతూ వుండేవారు. మ్యాడ్,

రఘునందన్ లు యిద్దరికీ ఫ్రెడ్, కేథరిన్ లు అప్పుడప్పుడు కనిపిస్తూ వుండేవారు కాదు. వెదకినప్పటికీ దొరికేవారు గాదు. ఫ్రెడ్ తన చాకచక్యంవల్ల యిలా చేస్తూవుండేవాడు.

"మ్యాడ్స్ తల్లి-దండ్రులకు యీ సంగతి చెప్పకుండా దాచటం మంచిదికాదని రఘునందనుడికి తోచింది. ఏవో మాటల సందర్భంలో యీసంగతి మ్యాడ్ తండ్రికి చెప్పాడు.

"సంగతి అంతా విని మాడ్స్య తండ్రి కొంతసేపు ఆలోచించి, మాడ్స్యను అక్కడకు పిలిపించాడు. ఇద్దరినీ దృష్టిలో వుంచుకుని, ప్రేమభావంతో" మీరిద్దరూ యింకా చిన్నవయస్సులోనే వున్నారు మీయిద్దరికీ కలిగిన యీ అనురాగం స్థిరమైనదో, తాత్కాలికమ్మైనదో తెలుసుకోనవలసివున్నది. రఘునందనుడు బ్యారిష్టరీ ప్యాసై భారతదేశానికి వెళ్ళేందుకు యింకొకసంవత్సరం గడువువుంది. ఈసంవత్సరంలోగా మీమ్మల్ని మీరే పరీక్షచేసి చూసుకోండి. ఈసంవత్సరం ఒకరినొకరు కలుసుకోటం గాని, వుత్తరాలు రాసుకోటం గాని పనికిరాదు. సంవత్సరం గడచిన తరువాతకూడా మీమనస్సులో యీ విధంగానే ప్రేమభావంవుంటే, వివాహానికి అనుమతి యిస్తాను" అన్నాడు.

"ఈమాటలు వినేప్పటికే యిద్దరికీ చాలా దుఃఖం కలిగింది. ఏవిధంగానూ యిది తప్పదు. అనుకుని యిద్దరూ విచారంతో ఆ సంవత్సరం వియోగ భారాన్నికష్టంతో మోశారు.

"రఘునందనుడు తన ధర్మాన్ని పాలించాడు. ఫ్రెడ్ ద్వారా ఒకరి క్షేమసమాచారాలు మరొకరికి తెలుస్తూ

వుండేవి. మ్యాడ్ తనకు వ్రాసే ప్రతివుత్తరమునూ, రఘు నందనునకు ఫ్రెడ్ చూపిస్తూవుండేవాడు సంవత్సరం పొడుగునా యీ వుత్తరాలవల్లనే రఘునందనుడు ధైర్యంతో వున్నాడు. శెలవులలో ఫ్రెడ్ యింటికి వచ్చినప్పుడు రఘునందనుడు వ్రాసే ప్రతి వుత్తరమునూ, అతడు మ్యాడ్ కు చూపిస్తూ వుండేవాడు.

"ఈవిధంగా సంవత్సరం గడిపి రఘునందనుడు వారింటికి వచ్చాడు. మ్యాడు తల్లి-దండ్రుల అనుమతి గొని యిద్దరూ వివాహం చేసుకొనుటకు వాగ్దానం చేసుకున్నారు. ఇద్దరూ చాలా ఆనందంగా రోజులు గడుపుతున్నాయి.

"జూన్ 16 వ తారీఖున రఘునందనుణ్ణి బార్ లో పిలుస్తారు. జూలై మొదటివారంలో వివాహం జరిగేందుకు ఏర్పాట్లు చేశారు. ఒకపక్షం రోజులు పెళ్ళికొడుకు - పెళ్ళి కూతురు ఇటలీలో వుండి (హానీమూన్) అచ్చటినుంచి తమ దేశానికి (ఇండియాకు) వెళ్ళేందుకు నిశ్చయించుకున్నారు.

"తన తల్లి - దండ్రులు యీ వివాహానికి అంగీకరించరేమోనని రఘునందనుడికి సంశయం కలిగింది. అతడికి తల్లి దండ్రులంటే అతిభక్తి. వాళ్ళ అనుమతిలేకుండా వివాహం చేసుకోవటం అతడికి యిష్టంలేదు. అందుకని ఒక పెద్ద వుత్తరం యీ విషయం అంతా వ్రాసి, వాళ్ళను అనుమతి యివ్వవలసిందిగా కోరాడు.

"రఘునందనుణ్ణిబార్ లో పిలిచే రోజుకు (ఎన్ రోల్ మెంటుకు) రెండురోజుల తరువాత తండ్రిదగ్గరనుంచి జవాబు వస్తుందని లెక్కవేశాడు. వుత్తరం వచ్చే చివరివారాన్ని

చాలా విచారంతో గడిపాడు. తల్లిదండ్రుల ఆజ్ఞలేకుండా తాను వివాహం చేసుకున్నందువల్ల తనకు పూర్తిగా ఆనందం వుండదేమోననే విచారం అతడి మనస్సును బాధిస్తూ వుండేది''

నాకు ఈ కథలో చెప్పబడ్డ మ్యాడ్ యీమెయే అయి వుంటుందనే విశ్వాసం రానురాను బలపడసాగింది. ఆమె మాటల ధోరణియే ఆ విధంగా తెలియజేస్తోన్నవి. నేను ఉత్సాహంతో "తరువాత ఏమి జరిగిందని" అన్నాను. ఒక పెద్దనిట్టూర్పు విడిచి మరల చెప్పసాగింది.

"ఉత్తరమునకు ఏ జవాబూ రాలేదు. జూన్ 18 వ తేదీ. అది వాటర్లూ యుద్ధవిజయ వార్షికోత్సవదినం. ఆనాడు రఘునందనుడి తండ్రి వచ్చాడు. మ్యాడ్ తండ్రి పాదములు పట్టుకుని నన్ను రక్షించండి. నాకు ఒకడే కొడుకు. మా ముదుసళ్ళకు యితడొక్కడే ఆధారము. మా దేశానికి తీసుకుపోయి ప్రాయశ్చిత్తం చేయించి, కులంలో కలుపుకుంటాను. మాజాతి పిల్లను పెళ్ళిచేస్తాను. మీ పిల్లను పెళ్ళిచేసుకుంటే బ్రతికివున్నన్నాళ్ళూ కులంలో వెలివేయబడి వుండాల్సిందే. ఇహ ఎప్పుడూ ఎవరినీ కులంలో కలుపుకోరు. కొడుకును యింట్లో వుంచుకోనేందుకు వీలుకాదు. చచ్చిపోయిన తర్వాత మమ్మల్ని దహనం చేసేందుకుగానీ, పిండప్రదానం చేసేందుకుగానీ వల్లగాదు. మీ కూతురును పెళ్ళిచేసుకుంటే నా భార్య దుఃఖం వల్ల ఆత్మహత్య చేసుకుంటుంది. నేను పిచ్చివాణ్ణి అయిపోతాను కాశ్మీరం వెడుతున్నానని వంకబెట్టి నా భార్యకు చెప్పకుండా యిక్కడకు వచ్చాను. దారిపొడుగునా ఫలాలు, రొట్టెలూ

తింటూవచ్చాను. నా కొడుకును నాకు యివ్వండి. అని అతి దీనంగా బ్రతిమిలాడాడు.

"అమ్మాయీ" అని సంబోధించి మ్యాడుతో కూడా యీ విధంగానే చెప్పాడు. అదివిని మ్యాడు తండ్రి "వాళ్లిద్దరూ పిల్లలు కారుగదా; పెద్దవాళ్ళయారు. వాళ్ళకు ఏది నచ్చినదిగా తోస్తే అలాచేస్తారు. నేను ఏ విధంగానూ అడ్డం చెప్పను. మీకు కూడా వారికిఅడ్డంచెప్పే అధికారం లేదు. ఇది ఇండియా కాదు. గ్రేట్‌బ్రిటన్ - స్వతంత్ర దేశము జ్ఞాపక ముంచుకోనండి" అని కటువుగానే జవాబిచ్చాడు.

అప్పుడు మ్యాడు తండ్రి రఘూను పిలచాడు. ఆయనతో రఘునందనుడు "నేను వివాహం చేసుకుంటాను. మా తండ్రిగారు అనుజ్ఞ యివ్వకపోవటం నా దురదృష్టం. కాని నేను తప్పకుండా వివాహం చేసుకుంటానని పిల్లకు వాగ్దానం చేసి మోసం చెయ్యలేను. నాదృష్టిలో యిదే అన్నిటికంటె ధర్మంగా కనిపిస్తోంది" అన్నాడు.

రఘునందనుడి తండ్రి "ఏమిటీ ? ఆ అమ్మాయిని వదిలి పెట్టడం అధర్మమా ? తల్లి దండ్రుల్ని చంపటం పుణ్యకార్య మేనా ? ధర్మమేనా" ? అన్నాడు.

"అప్పటికీ రఘునందనుడు చలించలేదు. కాని, మ్యాడు తిరిగిపోయింది. ఈ పరిస్థితిలో రఘునందనుణ్ణి వివాహం చేసుకోలేనన్నది.

"ఆమె తల్లి, తండ్రి, అన్న, చెల్లెలూ అందరూ ఆమెకు ఎంతో నచ్చ జెప్పారు. కాని, ఆమె ఒప్పుకోలేను.

"చివరకు రఘూ ఆమెను ఏకాంతంగా తీసుకువెళ్ళి ఏవేవో చెప్పాడు కాని, ఆమె సమ్మతించలేదు.

"నేను నిన్ను ఎంతగానో నమ్మాను. మనం ఒకరిని మరొకరం మనస్ఫూర్తిగా ప్రేమించుకుంటున్నాము. ఆ పరిస్థితిలో మనవివాహాన్ని ఏ పరిస్థితులు ఆపివెయ్యలేవను కున్నాను. ఇంతకాలంనుంచి నీవు నన్ను గాఢంగా ప్రేమిస్తున్నావనే నానమ్మకం అసత్యమేనా?" అన్నాడు రఘునందనుడు.

"మ్యాడ్ దీనికి ఏ జవాబూ యివ్వలేదు. అందుమీద తెలిసిందే నీవు నన్ను మోసగించావు" అన్నాడు.

"దీనికికూడా మ్యాడ్ జవాబివ్వలేదు.

"అప్పుడు రఘునందనుడు మ్యాడ్ కుడిచేతిని తన చేతులో వుంచుకుని ముద్దుపెట్టుకుని ఏడ్చాడు. ఆ తరువాత జీవితాంతము వరకు ఒకరినొకరు ఎడబాసిరి.

ఈ విషాదాంతకథను వింటూవుండగా నాకుకూడా దుఃఖం వచ్చింది. మిస్ క్యాంబెల్ మెదలకుండా వూరుకుంది. చాలా కష్టం మీద నేను తరువాత ఏం జరిగింది?'అన్నాను.

చాలా సేపటివరకు క్యాంబెల్ కూడా మాట్లాడ లేక పోయింది. ఆమెకపోలముల మీదుగా కన్నీరు ప్రవహించ సాగింది. ఈ దృశ్యాన్ని చూడలేక నేను తలవంచుకున్నాను.

కొంచెంసేపుఅయాక ఆమె మరల యీవిధంగాచెప్పింది.

"మ్యాడ్ ఆరోజున జవాబు చెప్పలేదు. కాని ఒకనాడు చెబుతుంది. పరలోకంలో రఘునందనుడూ తానూ కలుసు కొన్ననాడు చెప్పదలుచుకుంది. ఆరోజు కొరకు ఆమె ఎదురు

చూస్తూవుంది.

రఘు వెళ్ళిపోయిన తరువాత మ్యాడ్ చాలా జబ్బు పడ్డది. జీవించదని - అందరూ అనుకున్నారు. ఆ దురదృష్టవంతు రాలు అంతతేలికగా చస్తుందా? రఘునందనుడు ఒకేసారి తన దేశాన్నుంచి బంగారు గాజులజత తెప్పించి యిచ్చాడు ఆ గాజుల జతను ఆమె ఎప్పుడూ ధరిస్తూవుంటుంది. కొద్ది సంవత్స రాల క్రితమే ఆమె ప్రియుడు స్వర్గస్థుడయాడని ఒక వార్తా పత్రికలో చదివి, వెంటనే ఆగాజులు తీసివేసింది. హిందూ వనితలు భర్త మరణించిన పిమ్మట గాజులు ధరించరని విన్నది. అందువల్ల అలాచేసింది. మ్యాడ్ తన పడకగదిలో తన ప్రియుడి తైలచిత్రాన్ని ఒకదాన్ని గీసుకు దాచుకున్నది. దాన్ని చూస్తూ తన చివరిగడియలు ఎప్పుడు వచ్చునా-? అని ఎదురు చూస్తూవుండేది.

అని చెప్పి క్యాంబెల్ వూరుకుంది. నేను కన్నీరు తుడు చుకుని మొదటివలెనే తలవంచుకుని ఆలోచిస్తూకూర్చున్నాను. 'ఎవరా బ్యారిష్టరు? బొంబాయిలోవున్న వృద్ధ బ్యారిష్టరు లను చాలామందిని ఎరుగుదును, ఈఘటన ఏసంవత్సరంలో జరి గిందో తెలిస్తే లా-లిస్టుచూసి అతడి పేరు తెలుసుకోవచ్చును. అని మనస్సులో అనుకుని 'ఏసంవత్సరంలో జరిగింది?' అని అడిగాను.

ఆమె జవాబివ్వలేదు.

నేను తలయెత్తి చూస్తునుగదా ఆమె స్పృహతప్పి క్రింద పడిపోయి వున్నది.

గంట మ్రోగించాను. వెంటనే దాసీదివచ్చి "ఏమిటి?" అన్నది.

"యజమాని స్పృహతప్పి పడిపోయింది. నీళ్ళు తీసుకురా" అన్నాను.

దాసీది నీళ్ళు తెచ్చేందుకు పరుగెత్తుకు వెళ్ళింది. నేను తలుపులను అన్నిటినీ తెరిచాను. మంచువలె చల్లనిగాలి గదిలోకి రాసాగింది. ఆమె కప్పుకున్న శాలువనుతీసి ప్రక్కగా పెట్టాను, ఇంతలోకే దాసీది నీళ్ళు తీసుకువచ్చింది. ఆమె మొగంమీద నీళ్ళుచల్లాను. దాసీది ఆమె దుస్తులను వదులు చేసింది. స్మెల్లింగ్‌సాల్టు తీసుకువచ్చి ముక్కు దగ్గర పెట్టాను. ఆమె మెల్లమెల్లగా తలఎత్తి "ఏమిటి" అంది.

దాసీది – ఏమీలేదు. స్పృహ తప్పిపడిపోయారు. నేను–గదితలుపులన్నీ మూసేసి "యింతగా నిప్పుకాచుకోటం మంచిదికాదు. ఎలావుంది ?" అన్నాను.

"స్పృహతప్పి పడిపోయానా ? మిమ్మల్ని చాలా శ్రమ పెట్టాను. క్షమించండి. కులాసాగానేవుంది !"

"పదండి, మంచంమీద పడుకుందురుగాని !"

"పదండి" అని ఆమె లేచేందుకు ప్రయత్నించింది. కాని ఓపలేక కిందపడి పోబోయింది.

దాసీది, నేనూ కలసి ఆమెను పట్టుకుని పడకగదిలోకి తీసుకుపోయాము. ఆమెను మంచంమీద పడుకోబెట్టి "నేను వెళ్ళి డాక్టరును తీసుకువస్తాను. నువ్వు కిటికీతలుపులు తెరిచివుంచు" అని దాసీదానితో చెప్పి వెళ్ళుటకు సనుకకు తిరిగినప్పుడు నా

దృష్టి గోడకు వ్రేలాడగట్టిన ఒక తైలచిత్రంపై పడింది. నా కళ్ళను నేనే నమ్మలేదు, చూడగానే గుర్తించాను. అది మా తండ్రిగారు పడుచుతనంలో తీయుంచుకున్న ఫోటో కాఫీ. దాని కాపీ వకటి నా "ఆల్బం"లో కూడా వుంది.

అది చూచేప్పటికే అంతా తెలిసింది. వెంటనే వెళ్ళి డాక్టరును పిలుచుకు వచ్చాను. అతడిచ్చినమందు, మేముచేసిన పరిచర్యలవల్ల రాత్రి తొమ్మిదిగంటలకు ఆమె ఆరోగ్యం కుదుట బడింది. ఆ తరువాత నేను తోవపొడుగునా ఈ విషయమే తలుచుకుంటూ ఇంటికి వెళ్ళిపోయాను.

## 5

పై ఘటన జరిగిన తరువాత ఒక సంవత్సరంవరకు ఆ దేశంలో వున్నాను, ఆమెవద్దకు వెళుతూ వుండేవాడిని. ఆమె నన్ను పుత్రునివలె ఆదరిస్తూవుండేది. నేను ఆమెకు వ్రాసే వుత్తరములలో "తల్లీ" అని సంబోధించి వ్రాస్తూ వుండేవాడను. కాని ఆమె యెదుటఅలాపిలిచేందుకు సిగ్గుగా వుండేది.

ఆ తరువాత నన్ను బ్రిటిష్ మ్యూజియంలో చూచి నప్పుడు నాతండ్రి పోలికలతో వున్నందువల్ల ఆశ్చర్యపోయి చూచాననీ, తరువాత ఎవరో తెలుసుకుందామని ఆహోటలుకు వచ్చాననీ, లేకపోతే హొటళ్ళకు పోవుట ఆమెకు సమ్మతము గాదనీ చెప్పింది.

బ్యారిష్టరు పరీక్ష ప్యాసయ్యాను. ఆమెను నా వెంట స్వదేశానికి తీసుకు వచ్చేందుకు ప్రయత్నించాను. "మీరు

పెద్దవారయ్యారు. ఈ సమయంలో మీరు సుఖంగా కాలం గడపాలి. మాయింటికివచ్చి, మాతల్లివలె మీరు మాతో శుశ్రూష చేయించుకోనండి” అన్నాను. కాని ఆమె సమ్మతించక “ఈ వయస్సులో నాజన్మభూమిని వదిలి ఎక్కడకు వెళ్ళినప్పటికీ నాకు మనశ్శాంతి వుండదు” అన్నది.

భారతదేశానికి వచ్చి ప్రతిపందుగకూ ఆమెకు వుత్తరం రాస్తూ వుండేవాడిని. ఆమెకూడా జవాబు రాస్తూవుండేవి. నాకు వివాహం జరిగాక, ఆవార్తవిని ఆమెకు మాతండ్రి యిచ్చిన బంగారు గాజులజతను నాభార్యకు పంపించింది. నా భార్య వాటిని ఎప్పుడూ విడువక ధరించేది.

ఆ తరువాత నాకు ఒక కుమారుడు కలిగాడు. దానికి ఆమె జవాబు రాస్తూ “పిల్లవాడు కొంచెం పెద్దవాడు అయ్యాక కుర్రవానిని, తల్లిని తీసుకొని యిక్కడకు వకసారి రావలెను. చచ్చిపోకముందు మిమ్మన్ని ముగ్గుర్ని ఒకసారి చూడాలనివుంది” అని వ్రాసింది. ఈవిధంగా చాలా పర్యాయాలు రాసింది. వచ్చే సంవత్సరం ఆమెను చూచేందుకు వెడదామని నిశ్చయించుకున్నాము. ఈ విషయాన్ని ఆమెకు వ్రాశాను. కాని ఆవుత్తరం నెలపదిహేను రోజులు అయ్యాక తిరిగి వచ్చింది. కవరుమీద లండను పోస్టాఫీసు ముద్ర వుంది. దానిమీద “చిరునామాదారు చనిపోయినందున వుత్తరం త్రిప్పి పంపడమైనది” అని వుంది.

ఇప్పుడు నేను రెండవమారుకూడా మాతృహీనుడను అయ్యాను.

---

# అరుణ ప్రచురణములు

—o—

| | |
|---|---|
| తప్పా? వేలూరి శివరామశాస్త్రిగారు | 0-12-0 |
| ఎక్కడికి - ఇతరకథలు ముద్దుకృష్ణ | 0-12-0 |
| ప్రతిమాసుందరి: నాటిక | 0-10-0 |
| విడాకులు - "చలం" | 1-0-0 |
| అంతరాత్మ - విశ్వనాథ సత్యనారాయణగారు | 1-0-0 |
| విజయ (రసవత్తరమగు శరత్ నవల) | 2-0-0 |

## ఇతర పుస్తకాలు

| | |
|---|---|
| గ్రామపరిశ్రమల నిరూపణము జె. సి. మారప్ప | 0-8-0 |
| పీటలమీది పెండ్లి | 0-12-0 |

— శరత్ కథలు: నవలలు —

| | |
|---|---|
| శరత్ కథలు 1, 2, 3 భాగములు ఒక్కొక్కటి | 1-0-0 |
| సుభద | 2-0-0 |
| పండిట్ జీ | 1-0-0 |
| నిష్కృతి (శరత్ నవల) | 1-0-0 |

| | |
|---|---|
| కరుణకుమార కథలు | 1-0-0 |
| అరక్షణీయ - నవవిధాన్ ఒక్కొక్కటి | 1-4-0 |
| మేనరికం (కథలు) | 0-6-0 |
| మాణిక్యం ,, | 0-8-0 |
| ఏకావళి: వేలూరి శివరామశాస్త్రిగారు | 1-0-0 |
| కథలు - గాథలు; (పద్యం) ,, | 1-0-0 |
| వ్యత్యాసాలు - కథలసంపుటి ,, | 1-0-0 |

## మా సరిక్రొత్త ప్రచురణలు

(1) మణిదీపాలు:
పదుగురు సుప్రసిద్ధ ఆంధ్ర కథకుల కథలు ఏర్చికూర్చిన కథల సంపుటి.

(2) ప్రేమచందు కథలు:
నిత్యజీవితమును చక్కగా చిత్రించిన కథల కూర్పు.

## త్వరలో రానున్న పుస్తకాలు:

జీవిత చరిత్రలు - రాజకీయాలు
కథలు - సాంఘిక జీవితానికి సంబంధించిన పుస్తకాలు.

ఇవికాక వేలూరు శివరామశాస్త్రిగారు విశ్వనాథ సత్యనారాయణగారు, చలం, చక్రపాణి, కొడవగంటి, ధనికొండ, మొదలైయినవారి కథలు వగైరాలు, నవ్యసాహిత్యంకు మాకు వ్రాయండి.

వెరైటీ ఏజన్సీస్, పబ్లిషర్సు & బుక్ సెల్లర్సు,
తిలక్ పేట, బెజవాడ.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA122B185 |
| పుస్తకం పేరు | రసమయి |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 131 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |